త్వరలో వెలువడనున్నది

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడు

అలెగ్జాండర్ డ్యూమా

రచించిన

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(మొదటిభాగం)

అనువాదం

సూరంపూడి సీతారామ్

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికనుండి పునర్ముద్రితము

వెల : మూడున్నర రూపాయలు

కాపీలకు

ఆంధ్రగ్రంథమాల,

మద్రాసు 1.

# ఆంధ్రపత్రిక

సంవత్సరచందా
రు 12-0-0
విడిపత్రిక
4 అణాలు

ప్రతి బుధవారము
ప్రకటింపబడును
**Founder : K. NAGESWARA RAO**

సంపుటము **43**
సంచిక **46**
**1-8-51**

ఖర సంవత్సర ఆషాఢ బహుళ చతుర్దశి బుధవారము

## విషయానుక్రమణిక

## 1 ఆగస్టు 1951

# సరిహద్దులో సైనిక సమీకరణ



**1949** సంవత్సరారంభంలో కాశ్మీరులో యుద్ధాన్ని విరమించే విషయమై ఇండియా పాకిస్థాన్‌లకు ఒడంబడిక కుదిరింది అప్పటినుండి కాశ్మీర్ సమస్య వాదప్రతివాదాలు, ఆరోపణ ప్రత్యారోపణల స్థాయిలోనే మనల్ని కలవరపరస్తూ వుంది ఈ సమస్య ఇప్పుడు సైనిక సమీకరణల దాకా వచ్చింది ముఖ్యంగా గత మాసంరోజుల్లోనూ జరిగిన సంఘటనలు ప్రత్యక్షంగా యుద్ధోపద్రవానికి దారితీయకపోయినా, భయాన్ని, ఆందోళనను రెచ్చగొట్టేవిగా ఉన్నాయి

జులై 1 వ తేదీన శ్రీనగర్ రేడియోలో ఉపన్యసిస్తూ, పాకిస్థాన్ సేనలు జూన్ నెలలో అనేకసార్లు యుద్ధవిరమణ ఒడంబడికను ఉల్లంఘించాయనీ, ఈ ఉల్లంఘనను అరికట్టకపోతే వచ్చే ఫలితాలకు పాకిస్థానే బాధ్యతవహించవలసి ఉంటుందనీ భారత సంస్థానాలశాఖ మంత్రి గోపాలస్వామి అయ్యంగార్ తీవ్రంగా హెచ్చరించారు అదే తరుణంలో జూన్‌లో జరిగిన యుద్ధవిరమణ ఉల్లంఘనలను గూర్చి భద్రతామండలికి ఇండియా ఫిర్యాదు చేసింది

జులై 5 వ తేదీన పాకిస్థాన్ కాశ్మీర్ వ్యవహారాలమంత్రి గుర్మాని ఒక ప్రకటన చేస్తూ 1949 జనవరి 1 నుండి ఇండియా 492 సార్లు యుద్ధవిరమణను ఉల్లంఘించినట్లు తాము ఫిర్యాదుచేశామని, ఇండియా 392 ఉల్లంఘనలనే ఫిర్యాదుచేయగలిగిందనీ అన్నాడు అంటే పాకిస్థాన్ కంటే ఇండియా వందసార్లు ఎక్కువగా యుద్ధవిరమణోల్లంఘన చేసిందని ఆయన ఆరోపణ ఈ ఆరోపణను భారతరక్షణశాఖ ప్రతినిధి ఒకరు జులై 8 న ఖండిస్తూ ఇండియా 529 ఉల్లంఘనలను ఫిర్యాదు చేసినట్లు, తమ తమ సైనిక బలాలను వృద్ధి చేయరాదని యుద్ధవిరమణ ఒడంబడిక నిర్దేశిస్తుండగా పాకిస్థాన్ కాశ్మీర్‌లో తన బలాలను వృద్ధిచేసినట్లు ప్రకటించారు ఆ తరువాత నాలుగు రోజుల్లో పాకిస్థాన్ మరి రెండుసార్లు భారతీయ సైనికులపై కాల్పులు సాగించి యుద్ధవిరమణను ఉల్లంఘించింది

ఈ విధమైన తమ అక్రమప్రవర్తననుండి ప్రపంచదృష్టిని మరల్చడానికీ, తమ తప్పు కప్పుకోడానికీ జులై 15 వ తేదీన పాకిస్థాన్ ప్రధాని లియాకత్ అలీ ఖాన్ ఇండియాపై ఒక గొప్ప ఆరోపణ చేశారు భారతదేశం తనకు గల సైన్యంలో 90 వంతులను పాకిస్థాన్ సరిహద్దుల్లో కేంద్రీకరించిందని ఈ ఆరోపణ ఈ ఆరోపణకు సమాధానమిస్తూ, భారత సరిహద్దులకు తమ సైన్యం కదిలించబడిన మాట నిజమేనని, అయితే ఇది కేవలం ఆత్మరక్షణోద్దేశ్యంతోనే చేయబడిందనీ, పాకిస్థాన్‌పై దురాక్రమణ చెయ్యడానికి మాత్రం కానేకాదనీ పండిట్ నెహ్రూ స్పష్టంచేశారు

ఇండియా తన సైన్యాలను సరిహద్దు ప్రాంతాల్లో సమీకరించడానికి ముందు జరిగిన సంఘటనలను నిష్పాక్షికంగా పరిశీలించినవారెవరైనా నెహ్రూ ప్రకటనను హర్షించక మానరు పాకిస్థాన్‌లో అంతకు కొన్ని నెలలముందునుండి యుద్ధప్రచారమూ, ప్రలాపమూ విరివిగా జరుగుతున్నవి కాశ్మీర్ పాకిస్థాన్‌కు చెందిన భాగమనీ, దానిని పాకిస్థానీలు బలప్రయోగం ద్వారానైనాసరే ఆక్రమించుకుని తీరుతారనీ పాకిస్థాన్ ప్రతికలే కాకుండా, ప్రముఖనాయకులు, ఉన్నతాధికారాల్లోని వ్యక్తులు కూడా బహిరంగంగా బెదిరిస్తున్నారు మతోద్రేకాన్ని రెచ్చగొట్టి ఇండియాపై “జిహాద్” (మతయుద్ధం) ప్రకటించాలనే వెర్రికోరికను బాధ్యతగల అధికారులు కూడా వెల్లడిస్తూ వచ్చారు పాకిస్థాన్ ప్రభుత్వం అధికారరీత్యా ఎప్పుడూ ఈ ప్రచారాన్ని, ప్రలాపాన్ని ఖండించలేదు అందుచేత ఇవి ప్రభుత్వ సమ్మతమైన ప్రకటనలేనని నమ్మడానికి కావలసినంత సావకాశం ఉన్నది ఇది గాక తూర్పు బెంగాల్‌లో అధికసంఖ్యాకుల నిరంకుశత్వం భరించలేక అసంఖ్యాకంగా హిందూ రక్షణార్థులు పశ్చిమ బెంగాల్‌కు వలస రావడం జరిగింది ఇక కాశ్మీర్‌లో పరిస్థితి చెప్పనక్కరలేదు ఇండియా అదివరకు ఒప్పందాల ప్రకారం తన ఆక్రమణసేనలను నూటికి 20,25 వంతులు తగ్గించినప్పటికి పాకిస్థాన్ తనసేనలను తగ్గించలేదు ఎలాగైనా తిరిగి యుద్ధం రెచ్చగొట్టాలనే ఉద్దేశ్యంతో అనేకమార్లు భారతీయ గస్తీసైనిక దళాలపై కాల్పులు సాగించింది కాని భారతప్రభుత్వం కాశ్మీర్ సమస్యను శాంతియుతంగా పరిష్కరించాలనే ఉద్దేశ్యంతోనే మొదటినుండి ఉన్నందువల్ల సమితి సైనిక పరిశీలకులకు ఫిర్యాదులు చేయడంతోనే సరిపుచ్చింది కాని పాకిస్థాన్ కుతంత్రాలకు లొంగలేదు

భారత ఉపఖండానికి సమితి మధ్యవర్తి డా॥ ఫ్రాంక్ గ్రాహం విచ్చేసినప్పటి నుండి పాకిస్థాన్ విషప్రచారంలో కొత్త ఘట్టం ప్రారంభమైంది ఐక్యరాజ్యసమితిలో ప్రముఖసభ్యులైన బ్రిటన్ అమెరికాలచేత తన కనుకూలంగా ఉండే తీర్మానాన్ని పాకిస్థాన్ చేయించుకున్నప్పటికి భారతప్రభుత్వం అతి ధైర్యంతో దానిని తిరస్కరించింది బ్రిటన్ అమెరికాల మద్దతుతో సమితిద్వారా ఇండియాను లొంగదీయాలనే పాకిస్థాన్ ఎత్తుగడ ఈ విధంగా బెడిసికొట్టింది ఆ తీర్మానానుసారంగా డా॥ గ్రాహం మధ్యవర్తిత్వం నెరపడానికి వచ్చారు దాంతో పాకిస్థాన్‌లో యుద్ధప్రలాపం తీవ్రరూపం దాల్చింది పత్రికల దగ్గర్నుంచి సరిహద్దురాష్ట్రముఖ్యమంత్రి అబ్దుల్ ఖయ్యూమ్ ఖాన్, పశ్చిమ పంజాబ్ గవర్నరు అబ్దుర్ రాబ్ నిస్తార్, జఫ్రుల్లాఖాన్ మొదలైన ప్రముఖులదాకా ప్రతివారూ కాశ్మీర్ సమస్యకు యుద్ధమే పరిష్కారమార్గమని ప్రగల్భించడం మొదలెట్టారు జిహాద్‌ను రెచ్చగొడుతూ ఉపన్యాసాలు విజృంభించాయి దీనికి ఒకటే ఉద్దేశ్యం కనబడుతుంది కాశ్మీర్ సమస్యను తమ కనుకూలంగా పరిష్కరిస్తే సరేసరి, లేకపోతే యుద్ధంతప్పదన్న భావం డా॥ గ్రాహంకు కలగజెయ్యాలి

ప్రధాని నెహ్రూ జులై 17 న పంపిన సమాధానానికి పాకిస్థాన్ ప్రధాని తిరుగు జవాబు పంపించారు ఈ లేఖలో ఆయన పాకిస్థాన్‌పై ఇండియాలోనే యుద్ధ ప్రచారం జరుగుతోందని ఆరోపించారు ఇది సత్యదూరమైన విషయం ఇండియాలో బాధ్యతగల ఏ నాయకుడు, ఏ పత్రికా యుద్ధప్రచారం చెయ్యలేదు మతప్రాతిపదిక మీద నడిచే కొన్ని సంస్థలు మాత్రమే ఇటువంటి ప్రచారం చేశాయి కానివాటికి

భారత రాజకీయాల్లో ఎటువంటి పలుకుబడిలేదు వారి కంఠం ఆదినుండీ ప్రజాబాహుళ్యానికి వినిపించని హీనస్వాయిలోనే ఉంది కాని పాకిస్తాన్‌లో మతసంస్థయైన ముస్లింలీగ్ ఇట్టి ప్రచారం విరివిగా చేస్తూ వచ్చింది ముస్లింలీగ్ అంటే పాకిస్థాన్ ప్రభుత్వంతో తాదాత్మ్యం పొందిన మతసంస్థే అదే లేఖలో ఆయన మరొక ఆరోపణ కూడా చేశారు భారతప్రభుత్వం మిలిటరీ బడ్జెట్‌ను వృద్ధిచేసిందనీ సైన్యాలను పెంచుతోందనీ ఆయన అన్నారు హైదరాబాదు జునాగఢ్ ఆక్రమణ, నేపాల్‌కు సైన్యాలను పంపడం కూడా ఆయన ఉదహరించారు దీనికి పండిట్ నెహ్రూ జులై 23 న తిరుగు సమాధానం పంపారు మిలిటరీ బడ్జెట్ ఎక్కువ చేశామన్నది అసత్యమనీ ధరల పెరుగుదల, రూపాయి విలువ తగ్గింపు మూలంగా బడ్జెట్ మొత్తం పెరిగింది కాని అది నిజమైన పెరుగుదల కాదనీ, హైదరాబాదు మొదలైన అంశాలను ఉదహరించడం అప్రస్తుతమని ఆయన అన్నారు పాకిస్థాన్‌లో జరుగుతున్న యుద్ధ ప్రచారం ఆగితే తప్ప ప్రస్తుత భయాందోళన పరిస్థితి తొలగిపోదని ఆయన స్పష్టంచేశారు

పాకిస్థాన్‌లో చాలకాలంనుండి యుద్ధ సన్నాహాలు జరుగుతున్నాయన్న సంగతి రహస్యమేమీ కాదు విమానదాడి రక్షణ జాగ్రత్తలు పాకిస్తాన్ అంతటా 1948 ప్రాంతాలనుండే ఏర్పాటవుతున్నాయి పాకిస్థాన్ సేనలో అన్సార్లు, రజాకార్లు విరివిగా చేర్చుకోబడ్డారు సైనిక సంఖ్య పెంచబడింది ఇటీవల లాహోరులోనూ మరికొన్ని ఇతర ప్రదేశాల్లోనూ "బ్లాకౌట్" చేయబడింది బ్రిటిష్ మిలిటరీ ఉద్యోగులను ముఖ్యంగా సర్ అకిన్‌లెక్ ప్రభృతులను ఆహ్వానించి తమ మిలిటరీ ఏర్పాట్లను పాకిస్తాన్ వారు తనిఖీ చేయించారు; చెయ్యవలసిన మార్పులవిషయమై వారి సలహాలు తీసుకున్నారు గత కొలది దినాలలో ఈ ఇరువురు బ్రిటిష్ ఉద్యోగులు తూర్పుపాకిస్థాన్‌లో సైనిక వ్యూహాలను ఎక్కడెక్కడ ఏర్పాటుచెయ్యవలసిందీ ప్లాన్లు వేసి యిస్తున్నారని కూడా నమ్మదగిన వార్తలు వచ్చాయి ఇది ఇలా ఉంచి అమధ్య పాకిస్థాన్ ప్రభుత్వాన్ని పడగొట్టడానికి కుట్ర జరిగిందని లియాకత్ అలీఖాన్ చేసిన ఆరోపణ తీసుకున్న చర్యలు కూడా అనుమానించవలసినవే సైన్యంలోను, ప్రభుత్వంలోను తనకు వ్యతిరేకులుగా ఉన్నవారిని తొలగించడానికి చేసిన ఎత్తుగడే ఇది కావచ్చును

ఈ పరిస్థితులన్నిటి దృష్ట్యా భారత ప్రభుత్వం ఆత్మరక్షణకోసం తన జాగ్రత్తను పడవలసివచ్చింది పాకిస్థాన్ ఆశయాలు మొదటినుండి తెలిసినవే అయినప్పటికీ ఇటీవల పాకిస్థాన్ యుద్ధప్రచారము విజృంభించడం మూలాన ఈ జాగ్రత్త అవసరమయింది

పరిస్థితి ప్రసరించిరాగాన పడిన తరుణంలో పాకిస్థాన్ ప్రధాని పండిట్ నెహ్రూను కరాచీకి ఆహ్వానించ ఎంతైనా వింతగా ఉంది నెహ్రూ లేఖ జులై 26 న లియాకత్ అలీ జవాబు పంపుతూ ఈ ఆహ్వానం చేశారు అయితే ఈ ఆహ్వానానికి ఆయన కొన్ని షరతు తగిలించారు సరిహద్దుల్లోని భారతసైన

(48 వ పేజీ చూడండి)

# ప్రకాశంపంతులుగారి కంచువిగ్రహం ప్రతిష్ఠ



శ్రీ ప్రకాశంపంతులుగారి కంచు విగ్రహాన్ని జులై 23 న విజయవాడలో కేంద్ర తంతి తపాలా శాఖమంత్రి రఫీ అహ్మద్ కిద్వాయ్‌గారు ఆవిష్కరించారు $7\frac{1}{2}$ అడుగుల ఈ విగ్రహాన్ని శ్రీ అడవి బాపిరాజు పర్యవేక్షణక్రింద శ్రీ రాజారాం నాగప్ప తయారుచేశారు విగ్రహ విష్కరణ సభకు దాదాపు లక్షమంది జనం హాజరయ్యారు వేదికపై ఆసీనులై ఉన్నవారు సభాధ్యక్షుడు డా॥ ప్రఫుల్లచంద్రఘోష్ రఫీ అహ్మద్ కిద్వాయ్, ఎన్ జి రంగాగార్లు








## ఆదివారం, జూలై 22.

—ప్రధాని నెహ్రూ జయప్రకాశ్ నారాయణకు వ్యక్తిగతంగా వ్రాసిన లేఖ మూలంగా రైల్వే తగాదా శాంతంగా పరిష్కారమయ్యే అవకాశం కనిపిస్తోందని అ. భా. రైల్వే కార్మిక ఫెడరేషన్ ప్రతినిధి ఒకరన్నారు

—పాకిస్థాన్ సరిహద్దుల్లో ఇండియా సేనల సమీకరణ మూలంగా ఏర్పడే పరిస్థితిని చర్చించడానికి లియాకత్ అలీఖాన్ తన మంత్రివర్గ సభ్యులను, రాష్ట్రాల ముఖ్యులను సమావేశం చేశారు

—కేసాంగ్ చర్చలు చెప్పుకోదగినంత ఆశాజనకంగా లేవని జనరల్ రిడ్జివే ప్రకటించారు

—అమెరికన్ నౌకాదళ ప్రధానాధికారి ఎడ్మిరల్ షెర్మన్ నేపుల్స్‌లో మరణించారు

—కేంద్రప్రభుత్వంలో ఉంటూనే కిద్వాయ్, జైన్‌గార్లు కాంగ్రెసుకు రాజకీయంగా ప్రతికూలురై పనిచేయడం ఉచితంగా లేదని, ఇందుకు నెహ్రూ ఎలా ఒప్పుకున్నారో తన కర్థం కావడంలేదని రాష్ట్రపతి టాండన్ అన్నారు

—త్వరలో యుగోస్లావియా ప్రజలు టిటో ప్రభుత్వాన్ని కూలద్రోయగలరని సోవియెట్ ఉపప్రధాని మొలటోవ్ అన్నారు

—పర్షియా ప్రభుత్వానికి తాను ప్రతిపాదించిన పరిష్కార సూత్రాలనుగూర్చి అమెరికన్ ప్రతినిధి ఎవరెల్ హారిమన్ పర్షియాలోని బ్రిటిష్ రాయబారి షెపర్డ్‌తో సంప్రదించారు.

## సోమవారం, జూలై 23.

—తూర్పు పాకిస్థాన్‌లోని ముఖ్య కేంద్రాలకు రోజురోజుకీ కొత్తసేనలు దిగుమతి అవుతున్నట్లు, ముఖ్యంగా ఖుల్నా మార్గంలోని రైల్వేస్టేషన్ల ప్రాంతంలో సేనలు కేంద్రీకరింపబడుతున్నట్లు విశ్వసనీయమైన వార్తలు వస్తున్నాయి

—తూర్పు పాకిస్థాన్ ముఖ్యమంత్రి నూరుల్ అమీన్ కాశ్మీర్ విమోచన యుద్ధానికి తన రాష్ట్రం ఆత్రుత పడుతున్నదని బెదిరించారు

—ప్రధాని నెహ్రూతోను, భారత ప్రభుత్వాధికారులతోను చర్చలు సాగించడానికి కాశ్మీర్ మధ్యవర్తి డా॥ గ్రాహం కరాచీనుండి ఢిల్లీ వచ్చారు

—జమ్మూ, కాశ్మీర్‌లలో ప్రవేశించిన 26 గురు పాకిస్థానీ గూఢ చారులు అరెస్టయ్యారు

—రైల్వే సమ్మెను నిషేధిస్తూ జారీ అయిన ఆర్డినెన్సుకు అసమ్మతి సూచకంగా హర్తాళ్ చేయడానికి అ. భా. రై. కా. ఫెడరేషన్ కార్యవర్గం నిశ్చయించింది

—పెట్రోలు తగాదా గూర్చి ఒక బ్రిటిష్‌మంత్రివర్గ సభ్యునితో చర్చించడానికి పర్షియాప్రభుత్వం తన అనుకూల్యం తెలిపింది

—ఎవరెల్ హారిమన్ బ్రిటిష్ ఖజానా మంత్రిపేరు, పర్షియా ప్రభుత్వం సర్ స్టాఫర్డు క్రిప్సు పేరు సూచించగా బ్రిటిష్ ప్రభుత్వం బహుశా స్థానిక పరిపాలనా శాఖామంత్రి హ్యూ డాల్టన్‌ను పంపించవచ్చని అనుకుంటున్నారు

—కొరియాలో శాంతి కుదిరినా కుదరకపోయినా, ఇతరచోట్ల పరిస్థితి దృష్ట్యా అమెరికా తన ఆయుధధారణ కార్యక్రమం కొనసాగించాల్సిందేనని ట్రూమన్ ప్రకటించారు

—బ్రిటన్ అమెరికాలు తయారుచేసిన జపానీస్ సంధి ముసాయిదాను బర్మా తిరస్కరించింది

—గత యుద్ధంలో దేశద్రోహ నేరానికై కారాగార శిక్ష అనుభవిస్తున్న ఫ్రెంచి మాజీ మార్షల్ ఫిలిప్ పెటేన్ మరణించారు

—కృషక్ ప్రజా పార్టీ కార్యదర్శి పి. సి. ఘోష్ అధ్యక్షతను బెజవాడలో జరిగిన సమావేశంలో భారత తంతి తపాలా శాఖ మంత్రి కిద్వాయ్‌గారు ప్రకాశంగారి కంచు విగ్రహాన్ని ఆవిష్కరించారు

## మంగళవారం, జూలై 24:

—యూరప్‌కు అత్యున్నత మిలిటరీ, రాజకీయాధికారాలు కలిగిన "యూరపియన్ సైన్యం" ఉండాలని పారిస్‌లో సమావేశమైన యూరపియన్ సైన్య మహాసభ ప్రతినిధులు తమ తమ ప్రభుత్వాలకు సిఫార్సు చేశారు

—దక్షిణాసియాలో కమ్యూనిస్టు ప్రాబల్యం విస్తరించకుండా 8 కోట్లడాలర్ల సహాయం చెయ్యాలని అమెరికన్ కాంగ్రెసును దక్షిణాసియా వ్యవహారాల విదేశాంగ ఉపమంత్రి జార్జి మెక్‌ఘీ కోరారు

—బెలూచీ, పంజాబు రెజిమెంట్లు, తూర్పు పాకిస్థాన్ రైఫిల్స్ దళం జెస్సోర్ (తూ. బెంగాల్)లో కేంద్రీకరింపబడినాయని, విమాన విధ్వంసక ఫిరంగులు స్థాపించడం మొదలైన సమస్త సన్నాహాలు ఆ ప్రాంతంలో చేయబడుతున్నాయని వార్తలు తెలిపాయి

—పర్షియా ప్రభుత్వంతో పెట్రోలు తగాదాపై చర్చలు జరపడానికి బ్రిటిష్ లార్డు చాన్సెలర్ లార్డు జోవిట్ నియమింపబడ్డారు

—ప్రస్తుతం కమ్యూనిస్టు రాజ్యాలసైనిక సంఖ్య 90 లక్షలవరకూ ఉందని, సోవియెట్ విమానబలం (20 వేలు) ప్రపంచంలో కల్లా బలీయమైందని అమెరికా విదేశాంగ మంత్రి అచిసన్ చెప్పారు

—ప్రస్తుత ఆందోళన పరిస్థితి తగ్గాలంటే, పాకిస్థాన్‌లో యుద్ధ ప్రలాపాన్ని

(44-వ పేజీ చూడండి)

సీరియల్ నవల:

# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

అలెగ్జాండర్ ద్యూమా

## 46

మరునాడు మధ్యాహ్నం రెండుగంటలకి మాంట్ క్రిస్టో నివాసభవనంముందు, చక్కని రెండు గుర్రాలు పూన్చిన బగ్గీ ఒకటివచ్చి నిలిచింది ఏభైయేళ్లు పైబడిన భాగ్యవంతుడు కదు బగ్గీ దిగాడు అతని ముఖంలో విజ్ఞతకంటె తంత్రజ్ఞత అధికంగా గోచరిస్తోంది మైత్రికి అనువైనవాడు కాడని చూడగానే తెలుస్తుంది నౌకరొకడు బగ్గీ దిగి ఇంటిముందు కాపలావాడి వద్దకు వెళ్లాడు "కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో నివాసం ఇదేనా?"

"ఇదే కాని ఇవాళ ఎవరికీ దర్శనం ఇవ్వరు"

"అయితే ఇదిగో ఈ కార్డు ఆయన కియ్యి మా యజమాని స్వయంగా దర్శనానికి వచ్చి వెళ్లారని చెప్పు"

"నే నెప్పుడూ మా యజమానితో స్వయంగా మాట్లాడను"

బారన్ డాంగ్లర్ మళ్లీ బగ్గీ ఎక్కికూచుని తనలో గొణుక్కున్నాడు అబ్బో! ఈయ నెవరో నవాబుగారిలా గున్నాడు! నౌకర్లు యజమానితో మాట్లాడరుట అయినా అందులో ఏముందిలే! నాకు ఆయన పేర హుండీపత్రం వచ్చింది ఆయనకి ధనం కావలసినప్పుడే ఆయన్ని చూడవచ్చు" తరవాత బిగ్గరగా "డిప్యూటీల సభకి పోనియ్యి" అని కేక వేశాడు

మాంట్ క్రిస్టో కిటికీ తెరలవెనకనుంచి ఇది గమనిస్తూనే ఉన్నాడు డాంగ్లర్ వెళ్లిపోతూ ఇంటినీ, తోటనీ జాగ్రత్తగా పరిశీలించడం మాంట్ క్రిస్టో గమనించాడు ఇలా అనుకున్నాడు "హుఁ! ముఖంలోనే మోసమంతా ఇమిడి ఉంది ఇతన్ని చూస్తే అందరికీ ఎందుకు రోత కలగదో? చదునుగా వెనక్కి వాలిపోయే సర్పం పడగవంటి ఆ నుదురు, రాబందులాగ ఆ గుండ్రని తల, కొన తేరిన ఆ ముక్కు చూసి అతని మిత్రు లేమనుకుంటారో? అలీ! బర్టుక్సియోని పిలు"

బర్టుక్సియో క్షణంలో వచ్చాడు

"ఇప్పు డిక్కడికి వచ్చిన బగ్గీ చూశావా? ఆ గుర్రాలు చూశావా?"

"చూశానండి చాల చక్కగా ఉన్నాయి"

"అయితే పారిస్ అంతా వెతికి అన్నిటికంటె చక్కని గుర్రాల్ని కొనమంటే, అటువంటి గుర్రాల్ని కొనకుండా ఎందుకు విడిచిపెట్టావు?"

మాంట్ క్రిస్టో కోపగించినట్లు గమనించిన అలీ తెల్లబోయాడు సిగ్గుతో తలవంచుకున్నాడు

"నిన్ను డగడం లేదు అలీ! ఇంగ్లీషు గుర్రాల్ని నువ్వెంచలేవని నాకు తెలుసును"

బర్టుక్సియో సంజాయిషీ చెప్పుకున్నాడు "మీరు గుర్రాల్ని కొన్నప్పుడు, అవి అమ్మకానికి రాలేదండి అది కాక బారన్ డాంగ్లర్ తన గుర్రాల్ని పదహారు వేలకి కొన్నారండి"

"అయితే ఆయనకి రెట్టింపు ధర ఇచ్చి కొను. బాంకర్ అయినవాడు పెట్టుబడితో సమానంగా లాభంవస్తే విడిచిపెట్టడు"

"అలా ధరచేసి కొనమంటారా?"

"వెంటనే ఇవాళ సాయంకాలానికే అవి కావాలి జీనూ అవీ కొత్తవి కొను"

"చిత్తం సాయంకాలం తమ రెన్నిగంటలకి బయలుదేరతారు"

"అయిదుగంటలకి"

సరిగ్గా సాయంకాలం అయిదుగంటలకి బగ్గీ గుమ్మంవద్ద సిద్ధంగా ఉంది ఉదయం డాంగ్లర్ బగ్గీకి కట్టబడిన గుర్రాలు మాంట్ క్రిస్టో బగ్గీకి కట్టబడిఉన్నాయి మాంట్ క్రిస్టో వచ్చి ఒకసారి గుర్రాల్ని పరికించి బగ్గీ ఎక్కాడు బర్టుక్సియోని పిలిచి మాంట్ క్రిస్టో ఇలా చెప్పాడు "నార్మండీలో (ఉత్తరఫ్రాన్సు) సముద్రతీరాన ఒక ఎస్టేట్ కొనాలి బర్టుక్సియో ఒక చిన్న ఓడరేవు కాని, కనీసం చిన్న అఖాతం కానిఉండాలి నా ఓడ అక్కడ నాకోసం సిద్ధంగా ఉండాలి సరిగ్గా వాకబుచేసి స్వయంగా చూసి, అన్ని సదుపాయాలూ ఉంటే, వెంటనే నీ పేర కొనెయ్యి నా నౌకలు మూడింటినీ అక్కడ చేర్చు పారిస్‌నించి అక్కడ గుర్రాల బగ్గీల అంచెల ప్రతి ముప్ఫైమైళ్లకీ ఏర్పాటుచెయ్యి"

"చిత్తం"

బగ్గీ వెంటనే బయలుదేరింది అప్పుడు డాంగ్లర్ ఇంటివద్ద రైల్వే కమిటీ సమావేశం జరుగుతోంది మాంట్ క్రిస్టో వచ్చినట్లు పరిచారకుడు తెలియపరిచేవేళకే సభ ముగియవచ్చింది సభలోని వారందరూ శాసనసభ్యులే డాంగ్లర్ లేచి వారితో ఇలా చెప్పాడు "నేను తొందరపడి సభలోనుంచి వెళ్ళిపోవలసి వచ్చినందుకు క్షమించవలసిందని కోరుతున్నాను చాలా చిత్రమైన విషయం ఒకటి మీకు మనవి చేస్తున్నాను రోమ్‌నగరంలో మా బాంకర్లు థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ ఒక వ్యక్తిని నావద్దకు పంపారు ఆ వ్యక్తి కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో అని పేరు పెట్టుకొని తిరుగుతున్నాడు తను కోరినంత ధనంతో నావద్ద పద్దు ఆరంభిస్తాడట విదేశాలతో నా వ్యాపారాలలో ఇటువంటి హాస్యాస్పదమైన వ్యవహారం నే నెన్నడూ విన లేదు ఈ చిత్రమేమిటో నని ఆశ్చర్యపడుతూ ఇవాళ ఉదయం ఆయన ఇంటివైపుకు వెళ్లాను ఆయన కౌంట్ అని చెప్పుకుంటాడు కాని ఆ బిరుదు తెచ్చిపెట్టుకున్నదని నాకు తెలుసును కాని మీరు నమ్ముతారో లేదో! కౌంట్ బిరుదు తగిలించుకున్న ఈ పెద్దమనిషి ఇంటికి నేను వెడితే, 'ఇవాళ ఆయన ఎవరికీ దర్శనమివ్వరు' అని నౌకరు నాకు చెప్పాడు! మహా మహా నవాబులకే చెల్లని ఆ దంభానికి మితిలేదు నేను వాకబు చేస్తే గా క్యాంప్ ఎలిసీలో ఆ యిల్లు ఆయన దేనని తెలిసింది అయినా, పరిమితి లేని హుండీ

సీతారామ్

పైన అప్పు ఇవ్వడం అంటే బాంకర్ అయినవాడు జాగ్రత్తమీద ఉండాలి కదా! ఇందులో తప్పకుండా ఏదో పెద్దమోసం ఉంది కాని పాపం! నన్ను మోసం చెయ్యాలని ఎత్తువేసినవాళ్లు ఎవరిమీద ఈ పన్నాగాలు పన్నుతున్నారో తెలియగ నేను వీళ్లకంటె పెద్ద ఎత్తులే వెయ్యగలనని తెలీదనుకుంటా ఫరవాలేదు సరే! ఏమాతుందో చూద్దాం నవ్వినవా నాపచేనే పండిందంటారు!” అని డాంగ్లర్ వికృతమైన నవ్వుతో తన ఉపన్యాసం ముగించాడు ముగించి అదొక తీవితో ఇంటి సావడిలోకి దారితీశాడు

డాంగ్లర్ వచ్చిన సవ్వడి విని మాంట్‌క్రిస్టో వెనక్కు తిరిగాడు డాంగ్లర్ కొద్దిగా తల కెక్కించి ఆసనం చూపాడు మాంట్‌క్రిస్టో ఆసనం స్వీకరించాడు

“మాంట్‌క్రిస్టో అంటే మీరేనా?” అన్నాడు దర్జాగ

అవు నన్నట్లు తలూపి మాంట్‌క్రిస్టో, “బారన్ డాంగ్లర్, లీజన్ ఆఫ్ ఆనర్ కెవాలియర్, డిప్యూటీల సభ సభ్యుడు అంటే మీరేనా?” అన్నాడు ఈ బిరుగులు ఏకరువు పెట్టడంలో మాంట్‌క్రిస్టో తన్ని అపహాస్యం చేస్తున్నట్లు స్పష్టపడుతూనే ఉంది ఒకటి రెండు నిమిషాలు డాంగ్లర్ పెదవులు బిగించి కోపాన్ని అణుచుకుని మెల్లిగా ఇలా అన్నాడు “మిమ్మల్ని కౌంట్ బిరుదుతో పిలవనందుకు క్షమించండి కాని మనం ఇప్పుడు ప్రజాస్వామ్యపరిపాలనలో ఉంటున్నాం స్వతంత్ర ప్రతిపత్తిలో ప్రజలకి నేను స్వయంగా ప్రతినిధిని”

“అంటే, మీరు మీ బారన్ బిరుగుతో ఊరేగుతూ ఇతరుల బిరుదుల్ని ప్రజాస్వామ్యం కోసం పెరెత్తరన్నమాట!” అన్నాడు మాంట్‌క్రిస్టో

డాంగ్లర్ అప్రతిభుడైనాడు తరవాత మెల్లిగా తేరుకొని నిర్లక్ష్యభావం నటిస్తూ, ఇలా అన్నాడు “అసలు ఉత్తుత్తి బిరుదుల్ని నేను పరిగణించనండి కాని ఉన్నవిషయమేమిటంటే, ప్రభుత్వానికి నేను చేసిన సేవల్ని గమనించి ప్రభుత్వమే నాకు లీజన్ ఆఫ్ ఆనర్, బారన్ బిరుగులూ పదవులూ ఇచ్చింది కాని ”

“కాని మీరు ఉత్తమ పురుషుల ఆదర్శాన్ని అనుసరించి మీ బిరుదుల్ని పదవుల్ని విడనాడుకున్నారు కాబోలు”

“అది కాదు నేను బిరుదుల్ని పదవుల్ని బొత్తిగా విడనాడుకున్నానని చెప్పడంలేదు మాటవరసకి చెప్తున్నాను నౌకర్ల ముందు నాకు హోదా తప్పకుండా చూపెంచాలి కదా ”

“ఓహో! మీ నౌకర్లకి మీరు బారన్, ప్రభువు పత్రికాధిపతులకోసం మీరు కేవలం శ్రీయుతులన్నమాట మీకు వోట్లుఇచ్చే వారికి పురప్రముఖులు”

డాంగ్లర్ ఈ మారుకూడా రోషాన్ని ఆపుకోలేక పెదవులు బిగించాడు ఇటువంటి వాదంలో మాంట్‌క్రిస్టోకి తన ప్రజ్ఞ చాలదని తెలుసుకున్నాడు ఇంక తన ప్రజ్ఞ చూపాలంటే విషయం మార్చాలనుకుని ఇలా అన్నాడు కౌంట్! రోమ్‌నగరంలో థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీవారివద్దనుంచి నాకు ఉత్తరం వచ్చిందండి”

“సంతోషం మీ నౌకర్లతోపాటు నన్ను కూడా మిమ్మల్ని బారన్ అనే పిలవనివ్వండి బారన్! మీకా ఉత్తరం వచ్చినందుకు సంతోషం నేను స్వయంగా మీవద్దకి వచ్చి ధనం అడిగే బాధ తప్పిపోయిందని సంతోషిస్తున్నాను మీకు హుండీ అధికారపత్రం నాబాంకర్లవద్దనించి వచ్చిందికాబట్ట, ఇకనించి నేను రాసిఇచ్చే చెక్కుల్ని మీరు ఆదరించి ధనమిస్తారని భావిస్తాను మనం ఈ వ్యవహారాలలో సంకోచాలు పెట్టుకోవలసిన అవసరం ఇంక లేదనుకుంటాను

“చిన్న చిక్కొకటి ఉందండి” అన్నాడు డాంగ్లర్ ‘అంటే మరేం లేదు ఆ ఉత్తరంలోని అర్థమేమిటో నాకు పూర్తిగా బోధపడలేదండి”

“ఓహో!”

“అందుకే ఇవాళ ఉదయం మీ ఇంటికి వచ్చాను మీరు విడమర్చి చెప్తారనుకున్నాను”

“తప్పకుండా, నేనే స్వయంగా మీవద్దకు వచ్చాను కాబట్టి మీకు అర్థంకాకపోయిన ఆచిక్కేమిటో సెలవియ్యండి”

“ఏముంది? ఈ ఉత్తరాన్నిబట్టి కౌంట్ ఆఫ్ మాంట్‌క్రిస్టోకి మే మివ్వవలసిన ధనానికి పరిమితి అంటూ ఏదీ లేదు”

“ఇందులో అర్థం కాని విషయ మేమున్నది బారన్?”

“పరిమితి లేకపోవడం అంటేనే అర్థంకాలేదు అంతే! మరేం లేదు”

“ఆమాటల్ని ఫ్రాన్స్‌దేశంలో ఎవరూ వాడరా? బహుశా మీభాషలో అటువంటి మాట లేకపోయుంటుంది నాపేర మీకు హుండీ పత్రం పంపినవారు ఆంగ్లో—జర్మన్లు అందువల్ల వారికి ఫ్రెంచి భాష అట్టే తెలియలేదేమో”

“అదికాదు వారు వాడిన భాష నిక్షేపంలా ఉంది కాని పరిమితిలేకుండా ధనం ఇవ్వడం అంటే, ఆకంపెనీ తాహతేదో నాకు తెలియదు”

“నిజమా?” అన్నాడు మాంట్‌క్రిస్టో అతని మాటల్లో ఈ మారు అమాయకమైన సంకోచం ఉట్టిపడుతోంది “థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ పరపతి అంత మంచిదకాదా? నిజంగా మీ అభిప్రాయం స్పష్టంగా చెప్పండి బారన్ నాకు చెందిన ఆస్తి చాలా వారిచేతుల్లోఉంది నాకు కొద్ది ఆందోళన కలుగుతోంది నిజం చెప్పండి”

“వారి పరపతిని నేను సంకోచించడం లేదు ఆకంపెనీ మంచిపేరు గలదే కాని పరిమితిలేకుండా ధనమివ్వాలని వారు అంటున్నారు ఆ మాట అంత స్పష్టంగా లేదు”

“అంటే ఏముంది? ఇవ్వవలసిన ధనమెంతో, నా అవసరమెంతో వారికి స్పష్టంగా తెలియదన్నమాట”

“అవునవును నేనంటున్నది అదే అదే తెలియడంలేదు తెలియకపోవడం లేదంటే ముప్పున్నట్టేనని వ్యాపార రీతి తెలిసిన ప్రాజ్ఞు లంటారు”

“అంటే ఆకంపెనీ ఎంత తెలివితక్కువగా వ్యాపారం చేసినా బారన్ డాంగ్లర్ ఆ పద్ధతిని అనుసరించారన్నమాట”

“అదెల్లాగ?”

“ఏముంది? ఆ కంపెనీవారి వ్యాపారాల్లో ధనమివ్వవసినచోట హద్దులు పెట్టరు కాని బారన్ డాంగ్లర్ ఇచ్చే ధనానికి హద్దుంటుంది”

డాంగ్లర్ కొంత రూక్షస్వరంతో ఇలా అన్నాడు “కౌంట్ నా పెట్టుబడి తాహతుగురించి కాని, నా వ్యాపారపరపతిగురించి కాని ఇంతవరకెవ్వరూ ఆక్షేపణ తెలపలేదండి”

“అయితే అది నా ఒక్కనికోసం మిగిలిందన్నమాట” అన్నాడు మాంట్‌క్రిస్టో కటువుగా

“అలా నన్ననడానికి మీకు హక్కేముంది?”

“మీరు తెలిపిన ఆక్షేపణే కారణం మీ ఆక్షేపణనిబట్టి మీరు నాతాహతుకో మీ తాహతుకో అనుమానిస్తున్నారన్నమాట బహుశా మీతాహతుమీదనే మీకు సంకోచమున్నట్లు కనపడుతుంది”

డాంగ్లర్ మళ్లీ అతికష్టంమీద కోపాన్ని అణుచుకున్నాడు

రెండవసారి వాదంలో ఓటమికి తతతతలాడిపోతున్నాడు తన మాటలతో నే తన్ని ఓడిస్తున్నాడు కొంతసేపు మౌనంగా ఉండి తరవాత ఇలా అన్నాడు "సరే నా ఉద్దేశం ఏమిటో మీకు స్పష్టపరుస్తాను మీరు నావద్దనించి ఎంత ధనం మొత్తం తీసుకుంటారో చెప్పండి"

మాంట్‌క్రిస్టో పట్టుదల విడిచిపెట్టలేదు "పరిమితి చెప్పకుండా హుండీ తెచ్చుకోడంలో అర్థమేమిటంటే, నాకెంత అవసరం ఉంటుందో ముందు తెలియదన్నమాట"

ఇంక తన ఐశ్వర్యం గురించి చెప్పుకుని దబాయించడానికి వీలు చిక్కిందనుకున్నాడు డాంగ్లర్ కుర్చీలో వెనక్కి చేరబడి గర్వం, దంభం ఉట్టిపడేలా అన్నాడు "మీ కెంత కావాలో ఏం కావాలో నాకు చెప్పడానికి మీరు సంకోచించనవసరం లేదు మీకే తెలుస్తుంది డాంగ్లర్ కంపెనీతాహతుకి పరిమితి ఉన్నప్పటికీ, ఎవరికెంత పెద్ద మొత్తం కావలసినా ఇవ్వగలరని మీకే తెలుస్తుంది మీకు పదిలక్షల ఫ్రాంకులు కావలసినా"

"ఏమిటి ! ఏమన్నారు ?"

డాంగ్లర్ ఒక తరహా ప్రసన్నభావం నటిస్తూ అన్నాడు "ఏమన్నానంటే, మీరు చిక్కుల్లో ఉన్నట్లయితే మా కంపెనీ మీకు పదిలక్షల ఫ్రాంకులుకూడా అప్పివ్వగలదు"

"పదిలక్షలా ? ముష్టి పదిలక్షలు నాకెందుకు పనికి వస్తుందనుకున్నారు ? నేను నవ్వుతున్నానని మీరు కోపగించుకోకండి మీరు భారీగా ఇవ్వగల పదిలక్షల సొమ్ము ఎప్పుడూ నా జేబుల్లో ఉంటుంది" అంటూ మాంట్‌క్రిస్టో జేబులోనుంచి రెండు పత్రాలు తీశాడు అవి అయిగులక్షలు తక్షణం చెల్లించడానికి ప్రభుత్వ ఖజానా కివ్వబడిన పత్రాలు డాంగ్లర్ వంటి వ్యక్తులికి ఇటువంటి తార్కాణాలే చెంపపెట్లు డాంగ్లర్ ఆ పత్రాలు చూసి నెత్తిపైన పిడుగుపడినట్లు నిశ్చేష్టుడైనాడు తన కళ్లని తానే నమ్మలేకపోతున్నట్లు పత్రాల్ని మాంట్‌క్రిస్టో ముఖాన్ని పదే పదే పరికించ నారంభించాడు

మాంట్‌క్రిస్టో ఈమారు సాధుభావం ప్రకటిస్తూ ఇలా అన్నాడు నాదగ్గిర చెప్పకండి మీమాటలు నాకు నిజం చెప్పండి థామ్సన్ ఎండ్ ఫ్రెంచ్ కంపెనీ పరపతిలో మీకు నమ్మకం లేదనుకుంటాను అంతేనా ? మీకు వచ్చినమాదిరివే మరొక రెండు హుండీపత్రాలున్నాయి నాదగ్గిర ఒకటి వియనా కంపెనీవద్దనుంచీ, మరొకటి లండన్ కంపెనీవద్దనుంచీ, తీసుకున్నాను మీరు మీనోటితో ఒక్క మాట అంటే చాలు నాహుండీ తీసుకుని ఈ రెండు కంపెనీల్లో ఏదో ఒకదానికి ఇస్తాను"

ఈ దెబ్బకి డాంగ్లర్ తాళలేకపోయాడు డాంగ్లర్ పూర్తిగా పరాజయం పొందాడు మాంట్‌క్రిస్టో నిర్లక్ష్యంగా వేళ్లమధ్య తాటిస్తూన్న రెండు హుండీ పత్రాల్ని డాంగ్లర్ వొణికిపోతున్న చేతుల్లో తీసుకుని చూశాడు తరవాత పత్రాలు సరైనవో కావో సంకోచిస్తున్నట్లు కింది సంతకాల్ని పరిక్షించాడు ఇదే మరొక పరిస్థితయితే మాంట్‌క్రిస్టో అవమానింపబడినట్లు కోపించవలసిందే కాని డాంగ్లర్‌ని పెడదారి పట్టించాలని తలపెట్టిన మాంట్‌క్రిస్టో ఒక్కమాటనలేదు డాంగ్లర్ మెల్లిగా లేచి "ఈ సంతకాలతో మీ కిచ్చిన పత్రాలలో లెక్కలేనంతభాగ్యం ఉంది మీతో సంభాషణ తరవాతనూ, ఈ పత్రాల్ని చూసినతరవాతనూ సంకోచానికింక ఆస్కారంలేదు కాని నా ఆశ్చర్యానికి మితలేదని చెప్పాలి"

మర్యాద ఉట్టిపడుతున్నట్లు మాంట్‌క్రిస్టో ఇలా అన్నాడు "అబ్బే ఇదేముంది లెండి ఇలాటి చిన్న మొత్తాలు చూసి డాంగ్లర్‌వంటి బాంకర్లు ఆశ్చర్యపడరు ఇంక మన మధ్య వ్యవహారం సక్రమంగా పరిష్కారమైనట్లే నేను భావిస్తున్నాను నాకు కావలసిన ధనాన్ని మీరు రేపు తప్పకుండా పంపగలరనుకుంటాను"

"తప్పకుండా పంపుతాను కౌంట్ ! మీకెంత కావాలి ?"

"ఒకరినొకరు ఇప్పటికి అర్థం చేసుకున్నాంకాబట్టి సుమారుగా చెప్పగలను మొదటిసంవత్సరం అరవైలక్షల ఫ్రాంకులు ఖర్చుండవచ్చు"

"అరవై లక్షలే !" అన్నాడు డాంగ్లర్ నోరు తెరుచుకుని మాంట్‌క్రిస్టోవంక చూస్తూ ఉండిపోయాడు చివరికి తెప్పరిల్లుకొని "సరే మీయిష్టం"

"ఒకవేళ పైన కావలసినా మీవద్దనే తీసుకుంటాను ఇప్పటికి ఏడాదికి మించి ఫ్రాన్స్‌లో ఉండనవసరం లేదనుకున్నాను ఈ ఏడాదిలోనూ అరవై లక్షల మించ నవసరం ఉండదు అయినా అవసర్యం కలిగితే అప్పుడు చూద్దాం"

"కౌంట్ ! మీకు కావలసిన ధనం రేపు ఉదయం పది గంటలకి మీ ఇంటికి చేరుతుంది నోట్లు ఇమ్మన్నారా ? బంగారు నాణే లిమ్మన్నారా ?"

"సగం బంగారంలో పంపండి, సగం బాంక్‌నోట్లు పంపండి" అంటూ మాంట్‌క్రిస్టో లేచాడు డాంగ్లర్ ఇలా అన్నాడు "నే నొకటి ఒప్పుకోవాలి కౌంట్ యూరప్‌లో భాగ్యవంతుల భాగ్యం ఎంత ఉంటుందో నాకు తుదముట్ట తెలుసుననుకున్నాను కాని మీ కున్నంతభాగ్యం నా జన్మలో ఎరగను మీరు మరోకలా భావించకపోతే ఒకటి ప్రశ్నించాలనుంది ఇంత భాగ్యమూ మొదటినుంచీ మీ వంశంలో ఉందా ?"

"చిరకాలంనించీ మా వంశానికీ భాగ్యం ఉంది కొన్ని సంవత్సరాలవరకూ తాకకూడదని నిషేధిస్తూ ఆ భాగ్యాన్ని ఒక చోట దాచి ఉంచారు అది కొద్ది ఏళ్లుగా నా వాడకంలోకి వచ్చింది అందువల్ల మీకు ఈ భాగ్యాన్ని గురించి తెలియదంటే మీ దోషంకాదు అయితే క్రమక్రమంగా నా సంపద గురించీ నన్ను గురించీ ఇంకా తెలుస్తుంది లెండి" అంటూ మాంట్‌క్రిస్టో బిగ్గరగా నవ్వాడు ఈ నవ్వు చిత్రంగా ఉంది రోమ్‌లో ఫ్రాంజ్ ఈ నవ్వు వింటే గజగజలాడేవాడు

"మీ భాగ్యవిలాసాలముందు మా లక్షలతో మేము పేదవాళ్లవలె కనపడతాం" అన్నాడు డాంగ్లర్ "క్రమంగా మనం పరిచయం అధికం చేసుకోవచ్చును మీకు జాప్యంకాకుండా ఉంటే నా భార్యతో పరిచయం చేస్తాను"

మాంట్‌క్రిస్టో సమ్మతిస్తున్నట్లు తలూపాడు డాంగ్లర్ ఒక పరిచారకుని పిలిచాడు. "హెర్మినా ఇంట్లో ఉందా?" అని అడిగాడు

"ఉన్నారండి"

"ఒక్కరేనా ? మ రెవరైనా ఉన్నారా ?"

"ఎవరో అతిథు లున్నారండి"

డాంగ్లర్ మాంట్‌క్రిస్టోవంక తిరిగి, "కొత్తవా రెవరైనా ఉంటే చూడ్డానికి మీకు అభ్యంతర మేమైనా ఉందా ?"

"ఏమీ లేదండి నా కంత గర్వం అహంకారం లేవు"

డాంగ్లర్ పరిచారకుని మళ్లీ ప్రశ్నించాడు: "హెర్మినా వద్ద ఎవ రున్నారు ? డిబ్రే వచ్చాడా ?"

"అవునండి"

(45-వ పేజీ చూడండి)

కథానిక:

# ఇంగువకట్టిన గుడ్డ

"మోహన్"

"ఓయ్, నిన్నే"

"అబ్బా ఉండండీ, ఏదో మహా రాచకార్యం మునిగిపోతున్నట్లు ఎందుకల్లా గొంతు చించుకుంటారు?"

'ఏమిటా తలబిరుసుతనం ఒక్కసారి వచ్చి పొమ్మంటే'

'చెయ్యిఖాళీగా లేదు, ఏంపనో అక్కణ్ణుంచే చెప్పరాదూ?'

"తీరికఅంటూ నీజన్మకి ఏడ్చిందేం? ఇప్పటికే తొమ్మిదైంది గుప్పెడు మెతుకులు పడేస్తే విరగడైపోతాగా"

'ఆఫీసరుగారిక్కి టైం మించిపోతుంది కామోసు ఇంకా కుంభం దిగలేదు అవన్లే దేవి — దయచేసి వెంటనే తిరిగిరండి"

ఒకుభగుమంది ఇంతకూ నలుగురితో బాటు ఒక ఉద్యోగం సంపాదన అంటూ లేకపోబట్టేగా దీనికి ఇంతలోకువ అలుసూను అయినా తిండికి బట్టకులోటు లేకపోయిన తర్వాత నేనెట్టాతిరిగితే తనకేం? తన పనేమో తాను చూసుకోరాదూ? అహా, కాదు "లింగు లిటుకూమంటూ ఈనాడు ఇద్దరమే కనుక నాటకం ఆడుతున్నారు రేపు పిల్లలంటూ పుట్టింతరువాత ఎట్టా అని ఎన్నడైనా ఆలోచించారా? ఉన్నదాన్ని ఆర్పుకుతింటూ బలాదూరు తిరిగితే సరిపోతుందా ఏం? "అంటుంది మా శ్రీమతి అవును, నిజమే సంసారంలో దాని విధి అది చక్కగా నెరవేరుస్తున్నది మరి నేనో? ఈసడించుకున్నదంటే తప్పు దానిది కాదు

వెంటనే నిశ్చయించుకున్నా, తిరి ఎక్కడైనా ఒక ఉద్యోగం అంటూ లేకుండా ఇంటిగుమ్మం తొక్కరాదని పట్టుదలతో బయలుదేరాను మొన్ననే తెచ్చిన నాల్గుబస్తాల ధాన్యం వందరొఖ్ఖం ఇంట్లో ఉన్నాయి గనక ఇంటావిడ భోజనం ఎట్లా అనే దిగులు లేదు ఇంటి పక్కే మా మామయ్య, అత్తఉన్నారు తోడుకి

కాళ్లు స్టేషనుకు దారితీస్తున్నాయి మెదడు గత జీవితాన్ని నెమరు వేస్తున్నది, ఎక్కడకు పోవటమా అన్న ప్రశ్నకు జవాబుకోసం

లేనికుటుంబం కాకపోయినా శ్రీమంతుల క్రింద జమరాదు ఏడాదికి దాదాపు అరవెయ్యి దాకా అయివేజువస్తుంది

(20-వ పేజీ చూడండి)



కథానిక:

# న్యాయమూర్తి

సత్యమూర్తి

జగ్గన్న యింటికొచ్చేటప్పటికి చాలా పొద్దుపోయింది భార్య వంటపనులు చక్కబెట్టుకొని వాకిట కుమ్మరి పొయ్యిమీద నీళ్లు కాస్తూంది నాలికలు చాచుకుంటూ వెలుగుతూన్న తాటాకు మంటవెలుగు వీధి గుమ్మందాకా చీకటిని నాకివేసింది మతుగా జగ్గన్న గుమ్మంలో కాలు పెట్టేడు మామూలుగా అతనిలో కనుపించే ఉత్సాహమేమీ లేదు నిషేధం రోజుల్లో ఎంత నల్లమందు నల్లబజారులో కొని వేసుకున్నాడో అనుకుంటారు, అప్పుడు జగ్గన్న వాలకం చూచినవారు స్పర్శ తగిలిన రోకలిబండలా ముడుచుకపోయాడు తాటాకు మంటవెలుగు జగ్గన్న మీద ప్రసరించింది ముఖలక్షణాలు, నడకతీరు అన్నీ ఒక్కసారి భార్యకు గోచరించాయి యమకింకరుడేమో అనుకొంది గాబోలు "వచ్చారా!" అనైనా పలుకరించలేక పోయింది భార్య ఆదరణచూపక పోయినా తనంతటతానే వెళ్లిపొయ్యి సరసన చతికిలబడ్డాడు అప్పుడప్పుడే ఆరిపోతూన్న తాటాకు రేకులు జగ్గన్న మీద పడుతూనే ఉన్నై కాని కనీసం కూర్చున్న స్థితిలోనైనా మార్పును తీసుకరాలేక పోయినై సాహసించిన పరాయి మొగాడు సరసకువస్తే వణికేట్లు ఊగిపోయింది భార్య జగ్గన్నలో యీ మార్పుకు కారణం తెలుసుకోవాలని మథన చాలా ఉందిలోపల కానీ ఎలా ప్రశ్నించాలో తోచడంలేదు తన చిన్నతనంలో ఆమె తండ్రికి కోపం వచ్చినప్పుడు తల్లి ఎలాబుజ్జగించేదో అఘట్టాలన్నిటినీ వరుసగా జ్ఞప్తికి తెచ్చుకొని ప్రస్తుతానికి పనికివచ్చేదేమైనా ఉందేమోనని ఏరితూచి చూచుకొంది అవన్నీ కొన్నికొన్ని ప్రత్యేకతలు కలిగి భేదంగానే గోచరించాయి ఇలా మనస్సులో ఓపినంతసేపు తికమకలు పడి విసుగెత్తి "ఉః!" అని పైకి నిట్టూర్చింది జగ్గన్న ఆ నిట్టూర్పుతోటే బుర్ర వెనక్కుతిప్పి భార్యవైపు చూశాడు పరాయి మొగాడిముందు ఒంటరి అందకత్తెలా చలించిపోయింది "ఇలారా మాట" అన్నాడు జగ్గన్న, నా కష్టసుఖాలలో నీకూ అనుభవించే హక్కున్నది అని ద్యోతకంచేస్తూ అగాధంలోఉన్న చేదకు గేలంతగిలింది భార్య మెల్లిగా జగ్గన్న దగ్గరకు చేరుకుంది తుపానులను ఎన్నింటినో చూచింది జగ్గన్న భార్య వాటికంటే భయంకరంగా కనుపించింది జగ్గన్న ముఖం జగ్గన్న ముఖంలో గరిగ్గాయిలాంటి లక్షణాలు పదేళ్ళక్రితం ? సారి పొడచూపినై లాలించి ప్రేమించే తండ్రి జగ్గన్నను నిరాధారుడిగా జేసి స్వర్గస్తుడయ్యాడు కాళ్ళూ, చేతులూ, వ్యవసాయంలో నిపుణతా అప్పుడు జగ్గన్నకు మిగిలిన ఆస్తి ఈ ఆస్తిమీదే రాబడి ఖర్చులను సృష్టించుకొని జగ్గన్న వివాహం చేసుకొన్నాడు వివాహమైన తర్వాత అతనిలో ఉత్సాహం ఎప్పుడూ దెబ్బతినలేదు పూరిగుడిసెలోనైనా స్వర్గాన్ని సృష్టించుకోగలిగాడు ఆకారణంగానే జగ్గన్న ముఖంమీద కారుమబ్బురంగు పులిమితే ఎలావుంటుందో భార్య ఊహించుకోలేక పోయింది ఇంత ఊహాతీతమైన మార్పు మూలాన్నే జగ్గన్నభార్య తహతహలాడిపోయింది

"ఇలా కూర్చో . అలా నిలబడిపోయావే?" అన్నాడు జగ్గన్న, సరసకు వచ్చి నిలుచున్న భార్యను జూచి మోకాళ్ళ పటులున్న ముదుసలిలా కష్టంమీద బొత్తనకాళ్ళను కూర్చుందామె

"మా అయ్య బ్రతికి ఉన్నప్పుడు నాకు బాధ్యతలేమీ ఉండేవికావు అలాగని నన్ను వట్టి సోమరిని చేసి విడిచిపెట్టలేదు మా అయ్య కడుపునిండా తిండిపారేసి, కూడా తిప్పుకుంటూ, వ్యవసాయప్పని నేర్పేడు ఆరోజుల్లో నేనోవిద్య నేర్చుకుంటున్నాననే ఆలోచనలేదు గోళీలు, గూటిబిళ్ళలూ ఆగుకొనే పిల్లలుపొందే సంతోషాన్ని నేనూ పొందేవాణ్ణి నాకు యిప్పుడులాగే అప్పుడూ సొంతసూములేమీ ఉండేవికావు మా అయ్య చచ్చిపోయిం తరువాత నేను వంటిగాణ్ణయిపోయాను. ఎలా బ్రతకాలో నాకు తెలిసిందికాదు అన్నంలేక చావడమంటే ఏమిటో నాకు పూర్తిగా బోధపడింది నా కండబలిమి, వ్యవసాయపు పనితనం బాగా తెలిసిన జగన్నాథంబాబు నన్ను ఆదరించాడు నాకూ ముప్పూటలా భోజనం పెడుతూండేవాడు గతంలో మాదిరిగానే వ్యవసాయం చేస్తూండే వాడిని మా అయ్య ఉన్నప్పుడులాగే బాధ్యతలేకుండానే కాలం గడిచిపోయేది ఒక సంవత్సరం పెట్టుబడు లెక్కువై, రాబడితగ్గినా, రాబడిహెచ్చి, పెట్టుబడులు తగ్గినా నాకు ఒకలాగే ఉండేది ఎల్లగిత్తకంటే కర్రగిత్త ఒడుపు ఎంతమంచిదో, చురుకుదనం ఎలాంటిదో నాకు జగన్నాథం బాబుకన్నా బాగా తెలుసు అర్ధాన్నంగా కర్రగిత్త చచ్చిపోయినపుడు రెండుపూటలు భోజనం సహించిందికాదు జగన్నాథంబాయి మా అయ్యలాగే బుజ్జగించి గంజిపట్టించాడు మళ్ళీ కొత్తగిత్తలు కొన్నప్పుడు, నీకు మొన్న ముక్కుపుడక చేయిస్తేమురిసిపోయావే, అలా సంతోషించాను జగన్నాథంగారి దొడ్డరుగుమీద కూర్చుని పశువులు వచ్చేవేళ అక్కడ కుర్రాళ్ళందరితోనూ కొత్తగిత్తలతో బరువులాగడం, సవారిలో బాగా వెళ్ళడం వగైరా పందాలు వేసేవాడిని వరి దుబ్బులు బాగావేసి పొట్టలు తేలిపోకుండా పంటలు పండితే తపస్సు ఫలించినట్లు సంతోషించేవాణ్ణి నేనిలా సుఖంగా జీవితం గడుపుతూంటే జగన్నాథంగారు నేనేదో ఆయనకు హనుమంతుబంటులా ప్రవర్తిస్తూన్నానని నాలుగీధుల మొగలో పెద్దలందరివద్దా చెబుతూండేవాడు భారతంలో ధర్మరాజు కొక్కడికే స్థానం ఎందుకిచ్చారో జగన్నాథంబాబుకు ఎందుకు లేదో తెలియక హరిదాసులు చెప్పేవన్నీ అబద్ధాలని జమకట్టుకున్నాను అలా కాలంసంతోషంగా, మా అయ్య ఉన్నప్పుడులాగే, గడిచిపోయింది వెధవకాలం ఎంతమార్పు లేకుండా ఉందామని ప్రయత్నించినా, ఉండనివ్వదు రోజూ నేను చేసేపనిలోగాని, తిండిలోగాని మార్పులేదు మానవావస్థలు క్రమంతప్పకుండా నన్ను చేరుకొంటున్నాయి యౌవనవంతుడిని కాగలిగాను జగన్నాథంబాబు పెద్దప్రయత్నంజేసి నాకూ, నీకూ పెళ్ళిజేశాడు "పెద్దకుటుంబంలో వాడివి ఎంతకాలమని యిలా ఒకళ్ళమీద ఆధారపడి జీవిస్తావు? చెరువుకింద నాలుగెకరాల కొండ్రకౌలుకు చేసుకో శిస్తు ఒకళ్ళిచ్చి

నష్టేయియ్యి పెళ్ళయిందికదా! పిల్లా, జెల్లాకలిగితే కర్చులు మీరిపోతాయి," అని జగన్నాథంబాబు పెళ్ళయిన తర్వాత నన్నో రైతును జేశాడు అయినంత మాత్రంలో నేను స్వతంత్రించి ఏపనీ చెయ్యలేదు పూర్వపు మాదిరిగానే అడుకువగా మసలుకొంటూ విత్తినాలు చల్లడం దగ్గరనుంచి, కుప్పలునూర్చే వరకూ బాబు సలహాసే తీసుకొనేవాడిని సంసార విషయంలో గుట్టుమట్టుకూడా నాకు దగ్గరగాకూర్చుని చెబుతూండేవాడు, అట్టాంటప్పుడే మా అయ్య జ్ఞాపకంవచ్చి కళ్ళుతుడుచుకొనేవాడిని "ఇదిగో చూడు, జగ్గన్నా సంసారం చేయడం చాలా కష్టంసుమా! ఒక్క మనిషి సుఖపడడానికి పదిమంది కష్టపడి పనిచెయ్యాలి" అంటూండేవాడు జగన్నాథంబాబు ఉన్నన్నాళ్ళూ గురువూ, తండ్రి ఐ నన్ను సర్వవిధాలా అభివృద్ధికి తీసుకవచ్చాడు క్రమేపీ నేను పెద్దవాణ్ణయాను, జగన్నాథంబాబు కాలగర్భంలో కలిసిపోయాడు, పెత్తనం నారాయణరావు చేతికొచ్చింది ఏటొచ్చీ నారాయణరావు గారి దగ్గరకూర్చొని స్నేహభావంగా సంసారం గొడవలు మాట్లాడుకోవడంలేదు గాని కౌలు తీరువాయిల్లోగాని, మందమసాకత్తులలోగాని ఏలోపం లేకుండా బాబు ఉన్నపుడులాగే పనిజేస్తున్నాను నానోటి కాడ కూడు ఎలా పడగొట్టబుద్ధయిందో నారాయణరావుగారు యీ వాళపొలంలో కొచ్చి "మహాలక్ష్మమ్మ తీర్థానికి చేనుకాళీ చెయ్యవోయ్! ఈ సంవత్సరం సొంత వ్యవసాయం చెయ్యాలి" అని తేలిగ్గాచెప్పి నా సమాధానం వినకుండానే వెళ్ళిపోయాడు ఆ మాట వినగానేచేసే పనికూడా మానేసి తిన్నగా సుబ్బన్న కాపింటికి వెళ్ళేను. ఆయనప్పుడే భోంచేసి బయట కూర్చున్నాడు నారాయణరావు చేను ఒదలమన్న సంగతి మనవిచేశాను "దానికేముంది? సొంత వ్యవసాయంచేసుకుంటాడు గాబోలు, కాళీచెయ్యమన్నాడు నువ్వు మరోటి చూచుకోవోయ్ ఇల్లులేనివాళ్ళకు నూరిళ్లూ," అన్నాడు సుబ్బన్న కాపు న్యాయంచెప్పే పెద్దమనిషని ఆయనకంత పెద్దపేరు ఎందుకొచ్చిందో బోధపడింది కాదు ప్లీడరుతీర్పు చెప్తాడని యీ చుట్టుపట్ల గ్రామాలంట పెద్దపేరు సుబ్బన్నగారికి కర్రవిరగకుండా పాము చావకుండా చెబితే సరిపోతుందా? ఇల్లులేని వాళ్లకు నూరిళ్లని నాకు తెలియదు గాబోలు? మాదొడ్డన్యాయమూర్తి దొరికాడు"

"ఏదో యిన్నాళ్ళూ తండ్రీ కొడుకుల్లా పోయింది వారికీ మనకూ ఎల్లకాలం ఒక్కలా పోతుందా? కాళ్ళూ, చేతూలూ చల్లగా ఉండాలిగాని మీ వ్యవసాయానికంటే యీ ఊళ్లోభూమి కొలుకే దొరకదా? ఈ చేనుకు పెట్టుకోసే పెట్టుబడే మరోదానికి పెట్టుకుంటాము దీనికోసరం ఎందుకలా కలగదొక్కుకోవడం?" అంది భార్య యింతసేపూవిని

"కేదంటే పద సంవత్సరాలనుంచి చేస్తున్నాను వీళ్లి పొలం కొంప కూలిపోతున్నా, దొడ్డి గోడలు ధ్వంసం అయిపోయినా లక్ష్యం చెయ్యకుండా పొలంలో గట్టులంకలు వేసి, పెంటతోలి, మందకట్టించి భూమిని బంగారంలా చేసుకొస్తున్నాను సంసారం యిల్లూ వీటికంటే నాకు ఆభూమి ముఖ్యం జగన్నాథంబాబు గతించినా ఆ భూమిని ఆధారంగా చూచుకొని సర్వస్వం అనుకొని కాలం వెళ్లబుచ్చుతున్నాను పొలం కాళీ చెయ్యమన్నాడు నారాయణరావుగారు ఆమాట విన్నాను జగన్నాథంబాబు యీ వాళే చచ్చిపోయినట్లు తోచింది జగన్నాథంబాబు చచ్చిపోతూ నన్ను పొలం కాళీ చెయ్యమని రాసి యివ్వండే నారాయణరావుకు కాళీచేయించే హక్కు కద్ వుంది?" అన్నాడు జగ్గన్న భార్యవంక చూస్తూ

"మంచి అనుమానమే ఎవరైనా వింటే నవ్వరూ? మంచితనంగా చెప్పి ఒప్పించుకోవాలి గాని, ఒకరితో చెప్పించడం ఎంత అమర్యాద? తిన్నన్నాళ్లూ తిని యింటివాసాలు లెక్కపెట్టేడనరూ ప్రజలు?" అంది

మౌనంగాలేచి దిగులుగా వెళ్ళి మంచం మీద పడుకున్నాడు జగ్గన్న "నీళ్ళు కాగినై, లేచి వెళ్ళి నీళ్ళుపోసుకోండి," అంది భార్య ఆరాత్రి భార్య యేంచెబితే అదే ఎదురాడకుండా చేశాడు జగ్గన్న. అదంతా మనస్సుంచి కాదు, యంత్రంలా మట్టుకే

స్నానం, భోజనం వగైరాలన్నీ పూర్తి చేసుకొని కుక్కమంచ మొకటి బయట వేసుకొని సరిగ్గా ప్రక్క వేసుకోకుండా పైతువాలు పరచుకొని పరున్నాడు జగ్గన్న న్యాయమూర్తి జ్ఞప్తికి వచ్చాడు జగ్గన్నకు ఈమధ్య రైతు భుక్తం అవుతున్నాయి చాలాచోట్ల భూములు తను జగ

న్నాథం బాబుగారి భూములు దాదాపు పది సంవత్సరాలనుంచి సాగుబడి చేస్తున్నాడు మరి తనకా భూమెందుకు భుక్తం కాకూడదు ? చావుకు పెడితేనేగాని లంకణాలకు కుదరదన్న సామెత జ్ఞప్తికివచ్చింది కాబోలు జగ్గన్నకు నారాయణరావు శిస్తు గింజలు వసూలు చేసుకొంటూ ఎప్పటిలాగే ఉంటే యీపాడు బుద్ధులు జగ్గన్నలో పుట్టడానికి అవకాశంలేదు పరిస్థితులే మంచివాడిని దుర్బుద్ధిగానూ, దుర్మార్గుణ్ణి సుబుద్ధిగానూ మార్చేస్తుంటాయి సుబ్బన్న కాపు వట్టి పల్లెటూరి ప్రజల దృష్టిలో న్యాయమూర్తి ఆయనకేమీ ప్రభుత్వ పట్టాలు లేవు న్యాయ్యం చెప్పినందుకు జీతం, బత్తెంకూడా లేదు ఇలాంటి గౌరవ కార్యక్రమాల్లో స్వార్థం, అన్యాయాలకు ఎక్కువ తావుంది పట్టణాల్లో పట్టాలున్న న్యాయమూర్తులున్నారు వారిది ధర్మ యుద్ధం న్యాయంకోసరం యిద్దరు న్యాయ మూర్తులు కోర్టులో గొంతు చించుకొని దెబ్బలాడతారు తీరా ఆకాస్త పూర్తయిన తరువాత క్లబ్బుకు యిద్దరూ కులాసా కబుర్లు చెప్పుకుంటూ హాజరౌతారు

ఇలాంటి ప్రవర్తనే న్యాయమూర్తుల దగ్గరనుండి జగ్గన్న వాంఛించేది ఇంతెందుకు మొన్న ప్లీడరు ఒకాయన ఆగ్రామం వచ్చాడు ఐదేళ్లక్రితం దావాలో ఓడిపోయిన ప్రతిపక్షి వెళ్లి ఆయనకు నమస్కరించాడు ఎదుటిపక్షంలో ఓడిన మనిషి వాదించి తన్ను ఓడించిన న్యాయమూర్తి వస్తే ముఖం పక్కకు తిప్పుకొందుకు బదులుగా గౌరవంగా వందనా లర్పిస్తూంటే ప్లీడర్ల ప్రవర్తనలో లోపముందని ఎలా తెలుసుకోగలడు జగ్గన్న ? భయంవల్లా, భక్తివల్లా యీ వందనాలు ? అని ప్రశ్నించుకుంటే జగ్గన్నను దస్తావేజుల మతలబు తెలిసినవాళ్ల జాబితాలో జేర్చవలసి ఉంటుంది కాని జగ్గన్న మాస్తే వట్టి కొలుదారుడేగా ! ఇలాగే తనకు తోచినట్లు ఆలోచించుకొని పొలం తగాయిదా విషయమై ప్లీడరువద్దకు వెళ్లి సంప్రతించడానికి తీర్మానించుకొని పడుకున్నాడు

* * *

జలతారు అంచు పైకిబెట్టి తలపాగా చుట్టి, కంటిమెడ బనీను వేసుకున్నాడు జగ్గన్న చుట్టబొగ్గుపడి అంచుక్రింద కాలిన కొత్తపంచె తీసి కాలిన మచ్చ బొడ్డుకొంగులోకి వచ్చేలా కట్టుకున్నాడు చేపుడు కర్ర చేతులోనే వుంది తువాలు పైమీద ఉంది కిర్రుజోడుమాత్రం ఎరువుది చల్ది పొద్దెక్కేటప్పటికల్లా అప్పుడే పట్నంలో ప్లీడరు గారింటికి చేరుకోగలిగాడు అయ్యగారింకా లేవలేదు కూర్చోమన్నాడు బంట్రోతు అక్కడనుంచే ప్లీడరుగారి స్వభావాన్ని గురించి ఊహించుకోడం ప్రారంభించాడు జగ్గన్న "ఇంత పొద్దెక్కినదాకా లేవకపోవడ మేమిటి ? మనిషా, దున్నపోతా, ఏది తప్పినా కడుపుసాద తప్పుతుందా ? ఆకలైనా వేయడంలేదు కాబోలీయనకు ?" అనుకున్నాడు మనస్సులో మరో నిమిషానికి ఎదుటిగదిలో పదేళ్లకుర్రాడు పుస్తకాలతో ప్రవేశించాడు గట్టిగా చదువుతున్నాడు "ఆ వయస్సులో అంత స్పష్టంగా, గట్టిగా చదువ నేర్చినవాడు తన గ్రామంలో ఒక్కడూ లేడు ప్లీడరుగారబ్బాయి సామాన్యమా ? వయస్సు వచ్చేటప్పటికి ప్లీడరై కూర్చోవాలిగదా ! చిన్నప్పటినుంచీ యీమాత్రం ధాటీయైనా ఉంటేనేగాని రేపు ప్లీడరు చెయ్యద్దూ ?" అనుకున్నాడు

"ఇంతలో ధర్మం, బాబూ" అంటూ ఓ బిచ్చకత్తె గుమ్మందగ్గరకు వచ్చి నిలుచుంది ఇంత చదువులోవున్న మనిషీ ఒక్కసారి ఆగి "అలాఫో ! పొద్దున్నే తయారయ్యావ్ !!" అన్నాడు ఈమాట విన్నాక జగ్గన్న మనస్సులో మళ్లీ కొంత ఆలోచన సాగింది చదువుకున్న కుర్రాడంటే జగ్గన్న దృష్టిలో చాలా ఉత్కృష్టమైన గుణాలు కలిగిఉండాలి కాగితాలు కాల్చకూడదు తేగలో చందమామను మచ్చుకైనా రుచిమాడకూడదు బాబూ అని యాచిస్తే తన నోటితోటే పొమ్మనగూడదు ఇలాంటి రాతినారపీచు గుణాలుండాలని జగ్గన్న ఊహ చదువురాని కుర్రపీనుగలు ఎంతమంది యాచకులను పొమ్మని గసరటంలేదు తన గ్రామంలో ? సరిగ్గా అలాంటి ప్రవర్తనే ప్లీడరుగారబ్బాయిలోనూ కనుపిస్తే అసంతృప్తికాక మరేమిటి ? అయినా అంత చదువులో ఉన్నవాడికి ముష్టివాడి మాటలు ఎలా వినిపించాయి ? తనందుకోసరమే ఎదురుమాస్తున్నట్లు, "బాబూ," అనేటప్పటికి వళ్ళుమన్నాడు ఇదేమంత బాగుండలేదు ఒక్క భారతం వింటూంటేనే బోలెడు నీతులు తెలుస్తున్నపుడు, ప్రత్యేకం పుస్తకాలు చదివేవాళ్ళకు ఎన్ని నీతులు తెలిసుండాలి ? యిదేమీ ఆలోచించకుండా చదువుకు భంగమని విసుగ్గా పొమ్మన్నాడేమో ? పాము కప్పను పట్టుకొంటేనా కెందుకని పట్టించుకోకుండా ఎంతమంది ఆదారిని పోవడంలేదు అలాంటి ప్రాథమిక నీతిసూత్రమైనా ప్లీడరుగారబ్బాయికి తెలియదా ? ఎటుచూచినా చదువుకున్నవాళ్లకు ఉండవలసిన గుణాలేమీ కనుపించవీ అబ్బాయిలో ఇదంతా చెప్పి చదువుకునేవాళ్ల కుండవలసిన గుణాలెలా ఉండాలో బోధించాలనుకున్నాడు గాని యింతలో ప్లీడరుగారు ఎదురుగా కనిపించారు పైమీద తువాలు జారిపోయినా గమనించుకోకుండా చేతులు జోడించుకొని తనాలోచిస్తున్న దేమిటో మర్చిపోయి నిలుచుండిపోయాడు

"కూర్చోవయ్యా ! ఏవూరుమీది ?" అన్నారు ప్లీడరు

"మాది ఎలకతోడు బాబూ !"

"ఆహాఁ ! ఏంపనిమీద వచ్చారు ?"

"మీరు వెంకన్నకాపు నెరుగుదురు కాదండి ? ఐదేళ్లక్రితం ఏనుగుతల మామిడికాయలు - బాగా పెద్దవి లెండి - అవీ యింకా నూజీడి తియ్యమామిడికాయలు పట్టుకొచ్చాడు తమయింటికి"

"చూడండి గుమాస్తాగారు యీయనొచ్చిన పనేమిటో" అని లోపలకు వెళ్లిపోయారు ప్లీడరుగారు "కాస్సేపు కూర్చోండి చూస్తాను" అని గుమాస్తా కలం ఎత్తకుండానే సమాధానం యిచ్చాడు

జగ్గన్న మోకాళ్ల పట్టుజారిపోయినవాడిలా అలాగే బల్లమీద చతికిల పడిపోయాడు ప్లీడరుగారు తను రాత్రి ఊహించినట్లు కనుపించడంలేదు కృతజ్ఞత ముందులోకి కూడా దొరకనట్లుంది ఐదేళ్ళక్రితం వెంకన్నకాపు దావారోజుల్లో చుట్టుపల్లె ఊళ్లన్నీ తిరిగి అరడజను ఏనుగుతల మామిళ్ళూ, ఒక పాతికనూజీడి తియ్యమామిడికాయలు పట్టుకొచ్చి ప్లీడరుగారికిచ్చాడు అప్పుడు జగ్గన్న సాయానికని కూడా ఉన్నాడు అంతపెద్ద మామిడికాయలు యీ ఐదేళ్లలోనూ జగ్గన్న కంటికి కనబడలేదు చూస్తే మరపుకురాని కాయలు తిని "ఆయనిచ్చినవా ? ఎరుగుదును" అని మాటవరసకైనా అనలేదు ప్లీడరు ఎంత కృతఘ్నుడో ? 'ఐదేళ్లక్రితం నీకు మామిడికాయలిచ్చాం కదూ ?' అని అడిగితే ఔనని సత్యం చెప్పలేనివాడు, పదేళ్లనుంచి పొలం సాగుచేస్తున్నమాట వాస్తవమేనా ? అని నారాయణరావు నెలా అడుగుతాడు ? అందులోను యింత మందిమరుపు మనిషి, లేదా కృతఘ్నుడు, న్యాయమూర్తి ఎలా కాగలిగాడు ? ఇతనిమీద సుబ్బన్న

సీరియల్:

## పెద్దకథ: కుండపెంకులు

### శ్రీ భమిడిపాటి రామగోపాలం

(గతసంచిక తరువాయి)

నాలుగ్గంటలైంది తిరిగి తిరిగివచ్చాం అప్పటికి మామయ్యా అల్లుడూ ఎటో వెళ్ళిపోయారు ఆలస్యంగా వచ్చినందుకు అత్త కొంచెం కేకలేసింది మైసూరుపాకయితే చల్లారదు గాని పకోడీ చల్లారవా అన్నది కాఫీ తిరిగి వెచ్చబెట్టాలి మీకోసం' అంది

'ఎందుకు కేకలేస్తావు – నీ కిష్టముంటే పెట్టు లేకపోతే మానేయ్' అన్నాడు భూషణం

'ఇష్టం ఉండదు మరి ఎలా వుంటుందీ?' అని విసుక్కుని 'కూచోండలాగ!' అంది

ఇద్దరం కూచుని మాట్లాడకుండా ఫలహారం చేశాం నేను ఆశించిన ఉత్సాహమూ, అధికప్రసంగమూ, నవ్వులూ, అన్నీ బూడిదలో కలిసిపోయాయి

తినగానే భూషణం 'నువ్వు హాల్లో కూచోరా, ఇప్పుడే వొస్తాను' అని పెరట్లోకెళ్లాడు

నేను ఇటొచ్చాను శకుంతల బొమ్మల గదిలోకి ఇవతల గదిలోంచి వెళ్తోంది అప్పటి సొగసు శకుంతలలో నే నెన్నడూ చూడలేదు పోయిందేముందని దగ్గిరికి వెళ్లాను

గదిలో వాళ్ల పిన్నికూతుళ్లిద్దరున్నారు బొమ్మలు సర్దుతోంది శకుంతల లేత ఆకుపచ్చరంగు జార్జెట్ చీర కట్టింది దూరంనించే, నాకు పరిచయం ఉంది గాబట్టి ప్రెసిడెంట్ హైరాయిలు వాసనను గుర్తుపట్టాను కాని – ఈవిధంగా ఇదివరకెందుకు లేదు శకుంతల? ఎన్నిమాట్లు ఆ జార్జెట్‌లో నేను చూశాను? కాని ఇంత సౌందర్యం వుందా ఎన్నడైనా? ఇన్నాళ్లూ ఈ సౌందర్యాన్ని ఎక్కడ దాచింది? అంతకన్న ఎక్కువసేపు చూడలేదు ఏం తోచక డాబా ఎక్కిపోయాను షేడ్ కింద నుంచుని కిందికి చూస్తున్నాను, శకుంతల మళ్లా కిందివాకిట్లోకొస్తే కనపడేటట్టు

'శకుంతలా!' అని అత్త కేక వేసింది

వాకిలి మధ్యనించి వంటింటివేపు వెళ్తాండగా చూశాను ఇంత అందంగా వున్నావని శకుంతలతో ఎలా చెప్పను?

'నీళ్లు పోసుకుని ఆ బట్టలు అలాగే వొదిలెయ్యాలి గాబోలు ఎవళ్లి ఆరేసిరా!' అంది అత్త కటువుగా

'శకుంతల డాబామీదికి రావాలి బట్ట ఆరవెయ్యడానికి

నిజంగానే వొస్తోంది

అదుగో వొచ్చేసింది నేను లేననుకుని కాబోలు, ఆ కూనిరాగం!—అబ్బ, ఏమిటా భావం!

'ఇదుగో, శకుంతలా, ' అన్నాను తడబడి

'ఎందుకూ?'

'ఇవాళ అచ్చు లక్ష్మీదేవిలా ఉన్నావు – లక్ష్మీదేవి సౌందర్యానికి మంచి ఉపమానం కాదు రతీదేవిలా ఉన్నావు!'

'ఉంటే ఉన్నానులెండి మీరు కిందకి పదండి బాగుండదు'

'బాగుండకేం?' అంటూనే కిందకి వెళ్లబోయాను

డాబా మెట్లు ఒకచోట వంక తిరిగాయి అక్కడ ఆగాను

శకుంతల వొస్తున్న చప్పుడయింది; వెనకనే వొచ్చింది

దగ్గిరికి రాగానే ఛటుక్కున నడుముకి నా రెండు చేతులూ చుట్టాను విడిపించుకోడానికి ప్రయత్నిస్తోంది ఈలోగా నేను 'ఇంతందంగా వున్నప్పుడు కాకపోతే మరెప్పుడు?' అంటూ బుగ్గను వేటాడి రెండు ముద్దులు పెట్టుకున్నాను గుండెకు గుండె పూర్తి బలంతో హత్తుకున్నాను. ఎడమ బుగ్గమీద మరొక ముద్దు పెడుతూండగానే 'ఛీ' అంది, దిగులేసి వొదిలేశాను

అంతకన్న దిగులుగా శకుంతల కిందికి పోయింది

ఏం చేస్తుందో చూద్దామని అయినా వెనకనే వెళ్లడానికి వీల్లేకొచ్చింది సిగ్గువేసి అక్కడే వుండిపోయాను కారణం మన స్తత్వవేత్తలకు తెలుసు

రెండు నిమిషాలు గడిచేలోగా నేను కిందకి వొచ్చాను భూషణం పెరట్లోంచొచ్చి "నువ్వొస్తావురా?" అన్నాడు

"ఎక్కడికి?"

"కృష్ణమూర్తిగారింటికి పొద్దున్న వెళ్లాం – అక్కడికి!"

"నే రాను ఇంటికి పోతాను" అన్నాను

ఇటొచ్చి నాకు కనపడినచోటల్లా తొంగితొంగి చూశాను కాని శకుంతల కనపడలేదు సైకిలు తీసుకు వీధిగుమ్మంలో పెట్టాను మరి లోపలికెళ్లడానికి మనస్కరించక సాగాను

కిళ్లీదుకాణందాకా వెళ్లి కిళ్లీ తీసుకుని నములుతూ మళ్లా ఇటొచ్చాను వెంకటేశ్వర్లు మామయ్య మరదలుగారి కూతుళ్లు నలుగురూ, భూషణమూ, సరస్వతీ కనపడ్డారు శకుంతల లేదు అంటే, ఇంట్లోనే ఉందా?

వాళ్లని తప్పించుకుని చుట్టూ తిరిగి వాళ్లింటికి వెళ్లాను తలుపు కొట్టగానే అత్త తీసింది

"వాళ్లందరూ ఎక్కడికో వెళ్లేరు నాయినా, కూచో – చూసేవా యీ సంగతి? శకుంతల, వాళ్లతో వెళతానని ఎంతో ముచ్చటపడి యింతా ముస్తాబై తీరా బయల్దేరే వేళకు తలనొప్పంటూ మూలుగుతూ పడుకుంది!" అంది అత్త

శకుంతలకు కోపం వస్తుందని నేను అను

---

కాపు ఎన్నిరెట్లు మంచివాడు? ఒక పక్షంలో మనిషి చెప్పే సర్వం విని తిరువాత కదా ఏం చెయ్యాలో చెప్పాలి న్యాయమూర్తి? అలాంటప్పుడు ప్రతి ఫలాపేక్ష ఉన్న న్యాయమూర్తి ఉండి నేను చెప్పేది వినుపించుకోకుండా తనకు చెబితే తన లోకకు చెబుతాడేమిటి?" అనుకుంటూనే బల్లమీదనుంచి లేచి చేపుడు కర్రపట్టుకొని వెళ్లిపోయాడు "దావా నెగ్గినవాడు లోపల, ఓడినవాడు బయట, ఏడుస్తారు" ఇంకో యిలాంటి పెన్నో దావా, ప్లీడరు న్యాయాలకు వ్యతిరిక్తంగా ఉండేవి జ్ఞప్తికి తెచ్చుకొని నారాయణరావుగారి పొలంమీద పెట్టదలచుకొన్న పెట్టుబడిని మరో భూభాగానికి తరలించ నిశ్చయించుకున్నాడు ★

కున్నాను కాని దానిచాటున ఇంత ముఖ్యమైన పన్లు మానుకుంటుందని ఊహించలేకపోయాను ఒక్కసారి భయంవేసింది

గదిలో మంచంమీద పడుకుంది తలకు తెల్లటి గుడ్డ చుట్టుకుంది ఏదీ, జాగ్రత్తేదీ? ఆ గులాబీరంగు రవికేదీ? ఆ ఉత్సాహమేదీ?

ఈజీచైర్‌లో కూచుని జర్నలు ఒకటి తిరగవేస్తున్నాను "వళిపోతే మాత్రం చెప్పనాయనా!" అని ఆవిడ వెనకింట్లోకి వెళ్ళింది

ఆవిడా అటు వెళ్ళింది నేను శకుంతలగదిలోకి ఆత్రంగా వెళ్ళాను జోడుచప్పుడయినా సరే శకుంతల కదలలేదు

"శకుంతలా!" అన్నాను లోపల ఎంతో భయింగావుంది

శకుంతల పలకలేదు

తలకిదగ్గరగా వెళ్ళాను నిజంగా తలనొప్పి అని నమ్మకముంటే తలపట్టుకుని ఎత్తేవాణ్ణి కాని ఇప్పుడు అసలు ముట్టుకోలేకపోయాను

"నే నొచ్చాను పలకవా?"

ఇంకా ఏంపలకలేదు

"నా మీద కోపమా?"

"లేదు"

"తలనొప్పి నిజమేనా?"

"ఊఁ"

"ఇగుగో - నా వేపు చూసిచెప్పు, తలనొప్పినిజంగా నిజమే?"

"నన్ను పరామర్శించకండి మీరవతలికి నడవండి!"

"నేను చేసిందేమన్నా తప్పా?"

"   "

"తప్పే కావచ్చు కాని నేనేం చేసేది?"

"ముందు మీరవతలికి నడవండి"

"పోనీ, ఒకటరెండు ప్రశ్నలకి జవాబు చెప్పు నిన్ను నేను పెళ్లిచేసుకుంటాను గదా నేను చేసింది తప్పెలా అయింది? నీకు అది ఖచ్చితంగా తప్పే అని తోస్తోందా?"

"   "

"ఇలాంటిదాని వనుకోలేదు ఎంతో ప్రేమ చూపెడుతూంటే నిజమే అనుకున్నాను—పోన్లే నేనుచేసింది నిజంగా తప్పేఅని నీకనిపిస్తే క్షమాపణ వేడుకుంటున్నాను దీని కింత బాధపడవలిసిన అవుసరం లేదు ముఖ్యంగా మనం పెళ్లి చేసుకుంటాం గనక!" అన్నాను జోరుగా.

శకుంతల ఏమీ అనలేదు

"ఇదుగో - శకుంతలా నేను వెళ్తున్నాను ఇంక మీ ఇంటికి రావడం మానుకుంటున్నాను అబద్ధం ప్రేమ చూపించే వాళ్ళదగ్గిరికి రావడం అవసరంకాదనిపిస్తోంది—కాని ఎప్పుడయినాసరే, నేను చేసింది తప్పుకాదనీ, ప్రమాదం అంతకన్నా కాదనీ నీకు తెలీకపోదు ఏనాడైనా అలా తెలిస్తే నాకు కాకిచేత కబురంపు - నాకు నీ మీద ఏమీకోపంలేదు - మరి ఇదుగో, వెళ్తున్నాను"

ఇవతలికొచ్చేశాను తిన్నగా వంటింటి దగ్గిరకెళ్ళి "వెళ్తానత్తా, వాళ్లు మళ్లా ఎంతసేపటికొస్తారోను!" అన్నాను.

"వెళ్తున్నావా? వెళ్లు నాయనా, మంచిది మీ వాళ్లెవరూ భోజనానికీ వొచ్చేరుగాదు ఫలహారానికీ వొచ్చేరుగాదు మీరు తప్పించుకున్నా మాకు తప్పదు గద!—ఇదుగో ఈ పొట్లాం పట్టుకెళ్లు మీ చెల్లెళ్ళకీ తమ్ముడికీ ఇయ్యి" అంటూ అలమార్లోవున్న పొట్లాంతీసి ఇచ్చింది

*    *    *

రావడం మానుకుంటున్నాను అనిచెప్పేశానే, అది సాధ్యమా? ఇన్నేళ్ళ పరిచయం, ఇంత తీవ్రమైన ప్రేమ - ఇవన్నీ ఒక్క అతిచిన్న పనితో సరా? దీనికని నన్ను శకుంతల జన్మాంతంవరకూ అసహ్యించుకుంటుందా? ఇంత గుడ్డినీతి అయితే ఎలాగ? వివాహం కానిదే నేను శకుంతలను ముట్టుకోకూడదు కాని నా విషయంలో ఎంత ఓర్మివహించినా అది అసాధ్యమై ఊరుకున్నగ! దీని కింత అపరాధం నేను చెల్లించుకోవాలా?

ఒక వేళ శకుంతల దీన్ని పురస్కరించుకొని ఇకముందు నన్ను ప్రేమించడం మానివేస్తుందేమో! స్త్రీలు పురుషులకన్న వేగం ఆవిధంగా మార్చుకోగలరంటారు అదే శకుంతల అవలంబిస్తే ఇంక నేనేం కాను? నాతో పెళ్లికి ఒప్పుకోదు నా అంత దుర్మార్గుడికంటే ఏ నూతనుడినో చేసుకుంటుంది ఈ తెలివితక్కువ నిర్ణయం ఎంతపని చేయబోతుంది!

ఒక వేళ శకుంతల నామీద చూపిస్తూన్నది నిజమైన ప్రేమకాదేమో! నాతో మామూలు బావగారితో ప్రవర్తించినట్టే ప్రవర్తించిందేమో! - అలా అయితే నన్ను ఏమండీ అని పిలవడంకూడా తమాషాకేనా? కేవలం వాళ్లనాన్న సలహామీద జరిగిన పనేనా?

ఇప్పుడు నే నేమనుకోవాలి? ఏం చెయ్యాలి? శకుంతలకు-

జరిగిన సంగతి నిన్ను చాలా బాధించిందని నేను తెలుసుకున్నాను కాని అంత విచారించవలసిన కారణం నాకు కనిపించడంలేదు నువ్వింత విచారిస్తావని ఎరగకచేశాను నిన్ను నేను పట్టుకోగానే నువ్వు ఛీ అన్నట్టుచూశావు కాని వివాహం కానిదే మనం ఒకరొకరు ముట్టుకోకూడదన్న నీతిప్రకారం అలా చూశావేమోఅనుకుని నేను సాగిపోయాను దీనికోసం సరదాలను మానివేయడమూ, కల్పితమైన తలనొప్పి ఒకటిప్రకటించడమూ నాకేమీ నచ్చలేదు

నువ్వునన్ను ద్వేషిస్తావనిగాని అసహ్యించుకుంటావనిగాని నే నెన్నడూ అనుకోలేదు నువ్వు వ్యక్తిగతంగా నాతో చాలా ఇష్టంగానే ప్రవర్తించావు పోనీ తెలియనితనంవల్లనో అమాయకత్వంవల్లనో అలా ప్రవర్తించావనుకోడానికి వీల్లేదు నీవూ వ్యక్తివి చదువుకున్నదానివి పైగా నేనే నీ భర్తననీ, మనవివాహం ఇంచుమించునిశ్చయమైందనీ, ఎంతో అడ్డుఅనుకుంటున్న మా అమ్మకూడా అంగీకరించిందనీ నీకు తెలుసు అలాంటప్పుడు రోజూ నువ్వు చూపించే యిష్టమూ, అనుభవించే ననుసిగ్గూ, చేసే మధురహాసాలూ అనిష్టపు పిల్లలని నేనెలా అనుకోను?

నేను చేసింది ఏదో పెద్ద దుర్మార్గమనినువ్వనుకుంటున్నావు కానీ-ఈ దుర్మార్గనిక ఎంతో ఆలోచించే నేను నడుంకట్టాను నీవు వ్యక్తివనడం, నాలో ఈఆశ పుట్టడం-ఒక్కసారి జరిగాయి అంటే సుమారు నాలుగుసంవత్సరాల కిందట దీనికి నాందీ ప్రస్తావనలు జరిగాయి ఈ నాలుగేళ్లలోనూ ఎన్నెన్ని ఆశలు పెట్టుకున్నానో, ఎంతెంత పెద్ద గాలి మేడలు కట్టానో నీకు తెలిస్తే ఇది దుర్మార్గమనే నువ్వనుకోవు ఎన్నోరకాల సౌందర్యాన్నీ ఎంతో ఎక్కువయిన సౌకుమార్యాన్నీ నీలో చాలసార్లు చూచాను నీలోకూడా ఈకోర్క ఉంటుందనుకునే నామనస్సు ఎప్పటికప్పుడే తొందరపడగా ఆపాను కాని నేను మా మామయ్యగారింటినించి తిరిగొచ్చిననించీ నువ్వు కోర్కను ఆపలేనంత సుందరంగా కనపడ్డావు రోజుకు రోజూ రతీదేవిలా, వనలక్ష్మిలా కనపడసాగావు చివరికి నిన్న, చుట్టూ వున్న మధురతమ వాతావరణం నన్ను ఆకాశానికెత్తగా ఈ "దుర్మార్గానికి" సమకట్టాను

(36-వ పేజీ చూడండి)

కథానిక:

# నీరుగట్టుప్రయుగు

శ్రీ కృష్ణాతీరం ద్వారకనాథ్

"చిన్నపెద్ద రమ్మంటూన్నాడురా! గంగులూ, అరజంటుగా రమ్మంటున్నాడు"

"ఎందుకయ్యా - యీడ మళ్లకు నీళ్లు కట్తాన్నా పనైపోతానే వస్తానని చెప్పయ్యా"-

"వాళ్ళ మడికి చెక్కయెయ్యాలంట-చెవ్వు పట్టుకోని యీడ్చుకరమ్మన్నాడు"-

"ఇంకరవ్వంతే ఉందిలే-యీ కొంచెం పారబెట్టి వచ్చేస్తా"

"మీ యిద్దరికుధ్యా నేను రాయబారం-వస్తే వస్తానను, లేకుంటే రానని చెప్పు" అన్నాడక చిన్నరైతు మడికయ్యల్లో నీళ్లు పారబెట్టూన్న గంగుల్నుద్దేశించి

"వస్తావా"-అని పార కడుక్కున్నాడు గంగులు ఏమంటాడో యేమోనని భయపడుతూ పిన్నపెద్దా, గ్రామ మునసబూ అయిన వెంకటరెడ్డి దగ్గరికివచ్చి చేతులు కట్టుకోని నిలబడినాడు

"ఏమిరా! ఒకసారి పిలిస్తే గంటసేపటికగాని వచ్చేతట్టులేవే - బాగా కొవ్వు పట్టినావు చెప్పినమాట యినవుగా-" అని చురచుర చూచినాడు రెడ్డి

"నీళ్లు పారబెడ్తాంటినయ్యా" అన్నాడు గంగులు

"నీ మొగం పారబెట్టలా?-దొంగనాకొడుకా-యీ చెక్కమళ్ళో యెయ్యాల"

ఇటువంటి తిట్లు గంగుల కలవాటే మరి మాట్లాడకుండా రెడ్డి జీతగానితో కలసి ఆపని పూర్తిచేసినాడు ఆరోజు

మరుసటిరోజు తెల్లవారకముందే గంగులు లేచి మిగిలిపోయిన రామయ్య మడికి నీళ్లు పెడ్తున్నాడు ఇంతలో రామయ్య పటపట పండ్లు కొరుకుతూ వచ్చినాడు-

"నిన్న అంతగా చెప్పిపోతే యింకా యీ పొద్దటికికూడా నీళ్లు కట్టలేదే-మల్లా పంట చేతికొచ్చిందో లేదో అప్పుడే తయారైతావు సంచి తీసికొని-ఆళద్ద యిప్పుడేమైంది?" అని గద్దించి అరచినాడు రామయ్య

"రెడ్డేరి పిలిపించింటే పోయ్యింటినయ్యా! లేకుంటే మీమాట యెన్నడు కాదన్నాను" అన్నాడు వినయ విధేయతలతో గంగడు

"అన్నిటికీ రెడ్డేరిని అడ్డమేసుకొస్తావ్-తేరగా ఉన్నాడని-" అంటూ నాలుగు తిట్లు విసిరినాడు

ముఖంలో విచారం గోచరిస్తూండగా మారుమాటాడకుండా తనపనితను చూచుకుంటున్నాడు గంగులు

"తాడిపర్తిలో సాకలోల్లంతా స్ట్రయికు చేసినారంట - వాల్లకుడుగ్గులేవని - మాటమాట్లాడ్తే స్ట్రయికు-"

"స్టరయికంటే యేందయ్యా?"
అని ప్రశ్నించినాడు గంగులు

"ఇంతగుడ్డిస్తేనే మేం మీకు బట్టలుతికేది -లేకుంటే లేదని గుడ్డలుతక్కుండా కుచ్చున్నారట - నట్టమెవరికో, అట్లైమీరుకూడా స్ట్రయికు చెయ్యకూడదూ - మేంచెప్పిన పనిచెయ్యకపోతే"

"మాకెందుకయ్యా! అంతపని-"

"ఆసాకలోల్ల కెందుకో మీకూఅందుకే" అన్నాడు అతని ముఖంలోకోపం బాగా కనిపిస్తుంది

"వాల్లకూ మాకూ యేంసంబందమయ్యా వాల్లల్లో కొందరు సావుకార్లుండారు - మేమెంతున్నా బీదోల్లమేగదయ్యా"

"దుడ్డులేనంత సేపూ సచ్చిన కుక్కలు పడినట్టు పడింటారు అదిచేతికొత్తానే మమ్మల్నికూడా కిందిమూపే చూస్తారు-నీచపుముండా కొడుకులు-"

"అట్లకొందరు సేస్తారయ్యా - నేను మాత్రం అట్లామనిసినేకాదు-"

"ఎంత బుద్ధిమంతుడురా-అయితే చెప్పిన పనిచేసేదానికి నీ కెందుకంత కట్టం"

"నాకేం కట్టంలేదయ్యా - మా పనే యిదైతే"

"ఏమోలే - నీపని నువ్వుచేసుకో-"

తనపనితాను సక్రమంగా నిర్వర్తించుకుంటున్నాడు గంగులు

రామయ్య వానిపని పరిశీలిస్తూనే - "నీళ్లంతటికీపారబెట్టు" అనిచెప్పి వెళ్లిపోయినాడు

పగలల్లా పనిచేసి రాత్రిఇంటికిపోయినాడు గంగులు రాత్రి నిద్రపోయ్యే ముందు పగటి విషయం కొంచెం కొంచెం జ్ఞాపకం వచ్చింది

"అవును - తాడిపర్తిలో సాకలోల్లు స్టరయికు చేసినారు వాల్లకింత జీతమిత్తేగాని బట్టలుతకమంటున్నారు మరి మేంకూడా ఈపనే చేస్తే" అనుకున్నాడు

"ఈ పనిమేం చేస్తేమరిమాకు బువ్వ గింజలు-" అనుకున్నాడు తనలో - తన మనస్సులో తనభార్యా, ఐదుగురు పిల్లలూ ఒకరివెంబడి ఒకరు నడచినారు

గంగులుకు ఒకయకరం పాటు మడి ఉంది బాగాకష్టపడి దానితో ఒకటిన్నర పుట్ల ధాన్యం పండిస్తాడు ఇంక రైతులనుంచి యింకొక ఒకటన్నర పుట్టి వస్తుంది మొత్తం మూడుపుట్ల ధాన్యం యిల్లు చేరుతుంది అదే అతని సర్వసంపదలూ దానితోనే సంసార భారాన్ని లాగుతున్నాడు అది తనకు చాలినా చాలకపోయినా అదే భగవంతుడు తన కివ్వదలచినాడని తృప్తి పడేవాడు

సమ్మెవిషయం జ్ఞాపకం వచ్చినప్పుడు మాత్రం అతడేదో క్రొత్తదోవకు పోతాడు ఈ వృత్తినే వదలివేసి వేరొక వృత్తిలో ప్రవేశిస్తామనుకున్నాడు కాని తరతరాలనుండి వచ్చిన వృత్తిని విడిచివేస్తే యేదో పెద్ద పాపం చుట్టుకుంటుందనుకున్నాడు. ఎంతసేపు ఆలోచించినా అతని మనస్సు వేరే వృత్తిమీద మరలటానికి సాహసించలేకపోయింది

ఏ విషయమూ నిర్ధారించకుండానే నిద్రపోయినాడా రాత్రి గంగులు

దగ్గరున్న ఊర్లో సమ్మె జోరుగా సాగుతూంది "లాండ్రీ" లంటే యింతకుముందు ఏవగించుకుంటూండిన సదాచారపరాయణులకు తుదకదే శరణ్యమైంది గంగులుకు ప్రతిరోజూ హృదయంలో ఏదో కలతగా ఉండింది

రోజూ నిర్దాక్షిణ్యంగా ప్రసాదించబడే తిట్లతో-వంచిన నడుము యెత్తకుండా పని చేయటంవల్ల కలిగిన నొప్పితో-తన పని నిర్వర్తిస్తున్నాడు గంగులు

ఆ సంవత్సరం యెండలు తీవ్రంగా కాసినాయి, ఏమాత్రం వర్షం కురువలేదు ఎండల తీవ్రతవల్ల ఆ ప్రాంతంలో యిద్దరు ముగ్గురు చనిపోయినట్టుగా కూడా దినపత్రికల్లో ప్రకటించబడింది

"కరువుకుతోడు అధికమాసం" అన్నట్టు అప్పుడు క్షామం కూడా యేర్పడింది ఏమాత్రమూ వరి పంట లేదు పెద్ద పెద్ద భూస్వాములంటికూడా దాచిపెట్టిన వడ్లమూటలను బయటికి తీస్తున్నారు ఇంటింటా యెక్కడ చూచినా విసనకర్రలే "రాయలసీమలో క్షామం" అని దినపత్రికల్లో వాగిపోతూంది

ఈ సందర్భంలో మన గంగులు ఏకైక జీవనాధారమైన కొలువు యెండిపోయింది తన పెద్ద కుటుంబాన్ని పోషించలేకపోయినాడు గంగులు యిటువంటి సమయంలో కులవృత్తిని విడవకపోతే జరుగదు

గంగుల కేమీ పాలుపోలేదు ఏదైనా పని చిక్కుతుందేమోననే ఆశతో పొరుగూరికి వచ్చినాడు

అక్కడ ఒక మిల్లు యజమాని దగ్గరకు వెళ్లినాడు తనకేదైనా పని యిప్పించమన్నాడు

ఆ చిక్కిపోయిన యెముకల గూడునూ ఆ గుంటలుపడిన కండ్లనూ చూసేసరికి మిల్లు యజమానికి యేమాత్రమూ జాలికలుగలేదు కాగా "వీడేం పని చేస్తాడు" అనుకున్నాడు

"పోరాపో! యెంత మంది కంట పనులిస్తాం—ఏమీ ఖాళీలు లేవు—వచ్చిన దోవనే పో" అన్నాడు

అన్ని మిల్లులలోనూ యిదే జవాబ్ వచ్చింది ఊళ్ళో ఉండే అన్ని కోఆపరేటివ్ సొసైటీలకూ తాలూకాఫీసుకూ, హైస్కూలుకూ అన్ని చోట్లకీ తిరిగినాడు ఎక్కడా లేదన్నారు తిరిగి తిరిగి నిరాశ చేసికొని రాత్రికి పల్లె చేరుకున్నాడు

అక్కడ ఆకలికి తట్టుకోలేక ఒకమూలన వక్కి పండుకున్న తన భార్యనూ, ఏడుస్తూన్న తన చిన్నపిల్లల్ను చూచినాడు గంగుల కొక ఊహ తట్టింది రెడ్డిగారి యింటికి వచ్చినాడు

"అయ్యా!" అని అరచినాడు

వెంటనే రెడ్డి వాకిలితీసికొని వచ్చినాడు గంగుల్ని చూచి మండిపడినాడు

"ఏమిరా! మాట్లాడేంకి ఒక పొద్దనిలా! ఎప్పుడంటే అప్పుడేనా!"

"మీరిట్లా కోపగించుకుంటే యట్లయ్యా! నేనెట్ల బతికేది"

"బతక్కపోతే చావు - సరే వచ్చిన పనేమో చెప్పు పోదాము"

"అంత అవసరమైతే యెట్లయ్యా!"

"ఇష్టమొచ్చినట్లు మాట్లాడకుండా వచ్చిన పనేదో చెప్పు" అని గర్జించినాడు

"పంటలు పండలేదు బతక లేకుండా ఉన్నామయ్యా! యీయేడు యేదన్నా అప్పిస్తే మళ్ళాసారికి తీర్చేస్తాను"

"అయితే దుడ్డు కోసరమా! నువ్వొచ్చింది"

"అవునయ్యా! యేదో యిన్నాళ్లు మిమ్మల్ని నమ్ముకున్నోణ్ని?- అన్నాడు దీనంగా

"నాదగ్గరేం దుడ్డులేదిప్పుడు-అంతా సిస్తులైపోయింది"-

"ఉండికూడా లేదంటే యెట్లయ్యా"

"లేదురా అంటే-ఉంటే ఉందని చెప్పేదానికేమి?"

"నాల్నాళ్లనుండి యింట్లోవాళ్లంతా పస్తేనయ్యా! మీరు దయచూడకపోతే చచ్చిపోతాము"-

ఇంతలోకే ఊళ్ళో మంచి ఆస్థిపరుడనిపించుకుంటూన్న నాగిరెడ్డి వచ్చినాడు

"ఏమన్నా! ఏంపనుంది? యియ్యాలప్పుడు బయలుదేరినావు"

"అవుసర మొచ్చిందప్పా రేపటిదుడ్డు సరదాలె, నీ సహాయంకోసరం వచ్చినా"

"ఎంత కావాల్నొస్తుంది-" అన్నాడు వెంకటరెడ్డి

"నాలుగువేలు" - గంభీరంగా జవాబు వచ్చింది

"రేపటికి సర్దుతా లేన్నా! నీకేం భయం లేదు"-

ఈల వేసుకుంటూ యింటివైపుకు తిరిగినాడు నాగిరెడ్డి కృతజ్ఞతకూడా తెలుపకుండా

"ఏమయ్యా! ఆయనకు నాలుగేలు అప్పయిస్తాన్నావే - నాకు రెండునూర్లు యియ్యయ్యా-చాలుగూట్లో దీపం పెట్టి నిన్ను దలుచుకుంటా"-

"ఆయనా - నీవూ ఒకటేనా—?"

"కాకేమయ్యా- ఆయన మనిసీ - నేను మనిసి కాదా-?"

"ఇంతవరకూ వచ్చినావూ-తిండికి గతి లేదుగానీ మా యెదురుగ్గ అడ్డమాటలు మాట్లాడుతావా?"



"ఉన్నమాట అన్నానయ్యా!- తప్పు, అనొద్దు అంటే అనను నాకేం తెలుసయ్యా!"

"పరేలే కానీ నా దగ్గర దుడ్డులేదు యింకెవర్నన్నా అడుగు పో" అన్నాడు రెడ్డి

"ఇస్తేనేగాని పోనయ్యా-మీ కాళ్ళకు దండం పెడ్తా" అన్నాడు గంగులుమూర్ఖంగా

గంగులు రెడ్డికాళ్లు రెండూ గట్టిగా పట్టుకున్నాడు ఆ స్పర్శ రెడ్డి కోపాన్ని రెట్టింపుచేసింది 'అంటరానివాడు తనను తాకుతాడా! పైగా పొమ్మంటే పట్టు పట్టాడా-" అనుకున్నాడు

"పోరా" అని విదిల్చి కొట్టి తలుపు మూసేసినాడు రెడ్డి

ఆ తాపుతో "అయ్యా" అనుకుంటూ మెట్లమీదినుండి క్రిందికి దొర్లినాడు వెంటనే స్పృహతప్పిపోయింది

త్రోవనపోతూన్న ఒక హరిజనుడు అతన్ని తన యింటికి తీసుకొనిపోయినాడు తెలివి వచ్చిన తరువాత

"ఎందుకురా! అంత దెబ్బతగిలింది?" అన్నాడు

జరిగిన సంగతంతా పూసగ్రుచ్చినట్టు చెప్పినాడుగంగులు

'అయ్యో!పాపం అని ఒక కంచంలో కొంచెం సంకటి పెట్టినాడు గంగులకు

గంగులు ఆకొద్ది సంకటినికూడా తినలేక తినలేక తిన్నాడు తింటుండగా క్రొత్తహరిజనుడు

"ఈ సావుకార్ల సంగతంతా యింతే తా కష్టం చేసిచ్చుకున్నంత సేపూ చేయిచ్చుకుంటారు అక్కర పోతే మనల్ని తోడ్చిపారేస్తారు" అన్నాడు

అవునన్నట్టు ఊ కొట్టినాడు గంగులు

"తీసికోరాపాపం, పెండ్లాం బిడ్డలు ట్లు బస్తాన్నారో"

(46-పేజీ చూడండి)



# నవ్వులో నగ్నసత్యం

శ్రీ అవసరాల రామకృష్ణారావు

ప్యాసింజరు ఏదో స్టేషనులో దభీమని ఆగింది ఆ ఊపుతో యించుమించు ఖాళీగా ఉన్న ఆ థర్డ్ క్లాస్ కంపార్టుమెంటులో సగం సగం కన్ను మూస్తున్న ప్రయాణీకులు ఒక్కసారి ముందుకిపడి, నిద్ర తేలిపోయి - సర్దుకుని కూర్చుంటున్నారు ఆ చిన్న స్టేషనులో ఓ కాపులమ్మాయి, బియ్యాలు తణిఖీ చేసే ఆఫీసరూ ఎక్కారు

'రాత్రిపూట మరీ మోసేస్తున్నారు, వీళ్ల చాతుర్యంమండ! వెధవలు కళ్లముందు నుంచే!'

'అవును బాబూ మనకళ్లముందు నుంచే!' మాటకి మాటకలిపి నవ్వుతూ అంది తలుపు పక్క సర్దుకుని కూర్చుంటున్న కాపుపిల్ల ఎందుకందో దానికే తెలియాలి ఆఫీసరుకి మాత్రం కోపంవచ్చి 'నోర్ముయ్' అన్నాడు ఆ పిల్ల ఎడంచేత్తో నోరుమూసుకుని కుడిచేత్తో పమిట సరిచేసుకుని ఒదిగి కూర్చుంది

కాపుపిల్ల నవ్వు కెరటాలు చెవుల్లో హోరెత్తి - అనుభవింపబోయే ఆనంద స్మృతులు మేల్కొలిపి, లేచికూర్చున్నాడు వీరరాఘవులు సుపరిచితమైన ఆనవ్వు నవ్వినదెవరో 'చూద్దామన్నా ఆ చీకటి చాటుల్లో అతనికి సరిగ్గా కనిపించలేదు ఆఫీసరు హూల్ హాల్ మని ఓసారి నలుగురి మీదా ఎగిరి, అందరిసామాన్లూ ఓసారి పరికించి, దిగేలోగా ప్యాసింజరు కదిలింది విసుక్కుంటూ ఓచోట ఖాళీ చేసుకు కూర్చున్నాడు

'ఎన్నో నెలపిల్లా?' తన విషయం కన్న యితరుల విషయంలో ఎక్కువ వివరాలు కనుక్కునే ఒక ముత్తైదువ, కాళ్లదగ్గర కూర్చున్న కాపుపిల్లనడిగింది ఆపిల్ల జవాబు చెప్పిందా, లేదు అలా అని ఊరుకుందా, అబ్బే - శీతలపవనాలకి పారిజాత పువ్వులు రాలినట్టు కిలకిలా నవ్వింది ఈ నవ్వుతే వీరరాఘవులికి ఆపిల్లెవరో తెలిసిపోయింది! తను ఎవరికోసం వెదుకుతున్నాడో అదే! అతను అనుకోకుండా 'గౌరీ!' అన్నాడు ఈ తీయని పిలుపు చెవుల్లో సోకిందో లేదో - గౌరి పరుగుపరుగున వీరరాఘవులు దగ్గరకొచ్చేసింది

'మావా' అని అరచి అతని చేతుల్లో చేతులు వేసింది ఆఫీసరుకు సిగ్గేసి అటు తిరిగిపోయాడు వీరరాఘవులు వెలవెలాబోయాడు! ఏమిటది? ఇంతకన్నా అన్యాయం ఉందా? ఈ తొమ్మిది నెలల కడుపేమిటి? ఏమిటి దీనికర్థం? చేతుల్లోంచి గౌరి చేతులు తీసేస్తూ 'ఏమిటిది గౌరీ?' అన్నాడు వణుకుతూ అతని కంగారు చూసి గౌరి పకపకా నవ్వింది నిజానికి ఆమె నవ్వుల్లో వెన్నముద్దలు రాలేయి! పాలతరగలు జారేయి! కాని వీరరాఘవులికి ఆనవ్వుల్లో విషబిందువులు ఒలికినట్టూ, సానిటక్కులు ఒలికినట్టూ అయింది

'తర్వాత చెప్తా మావా', అంది గౌరి ఎదురి బల్లవైపు సంశయంగా చూస్తూ 'ఛీ-ఏటి తర్వాత సెప్పేది? సేసినపనిసేసి సిగ్గులేక ఏ మోహం ఎట్టుకుని నవ్వుతుండావే? నా ముందునుంచి పో గుడిసేటి ముండ' ఈ మాటలికి గౌరి తొణకలేదు బెణకలేదు హాసనకలువలు విరిసిన ఆమె ముఖతటాకం ఏ విధమయిన మార్పు చెందలేదు వెళ్లి మామూలు సీటులో కూర్చుంది

'పై పెచ్చు నవ్వులుకూడాను సిగ్గులేని ముండ - సీ! యీ ఆడోళ్లని నమ్మినంత బుద్ధితక్కువ మరోటి లేదస్' వీరరాఘవులు కిటికీలోంచి అవతలకు ఉమ్మేశాడు

నే నెక్కడికి వెళ్లేది? ఎవరికోసం?'
ఈ ప్రశ్నకి సమాధానం తోచలేదతనికి

* * * *

సిగ్గులేనిముండ సిగ్గుతెరలు చీల్చుకుని యింకా నవ్వుతూనే ఉంది 'అందరూ హాయిగానే ఉంటారు మాలాంటివాళ్లకే ఎక్కడలేని బాధలూను. పదహారేళ్లయింది కాపురానికొచ్చి ఎన్ని వ్రతాలుచేసినా ఎందరికి మొక్కినా కడుపుకోసినా నలుసు లేదు దానికేం? నవ్వినా నవ్వుతుంది పోకిరీముండ! నా కన్నయిది నోచిననోము లేమిటో!' అనుకున్నది ఓ కోరికలు తీరని కోమలాంగి.

* * * *

'ఎక్కడ దిగుతావోయ్ నువ్వు?'

అటువైపు తిరిగి అన్యథా ఆలోచిస్తున్న వీరరాఘవులు యీ మాటవిని ఆఫీసరువైపు తిరిగేడు

'ఒచ్చే టేసినులోనండి' ఆఫీసరు ఓగడీ ఆగి, ఉండలేక అడిగేశాడు

'ఆపిల్ల నీ కేమౌతుందోయ్?'

'మా యింటిదే నండి'

'మరి ఆస్టేషనులో ఎక్కిందేం? నువ్వెక్కడనుంచి ఒస్తున్నావ్?'

'సామర్లకోటలో ఏదో కంట్రేకటరుకుని తగిలి ఎల్లేను బాబూ ఎనిమిది మాసాలొద్ది తిరిగి యీ నాడు ఒస్తున్నాను ఇక దాని ఊసంటారా? రంకుముండ దానికో ఊరేటి బాబూ? ఎక్కడెక్కిందో, ఎక్కడికెళుతుందో!'

'అదేమిటోయ్ అలా అంటున్నావ్?'

'ఏమో బాబూ! వీర్ని నమ్మగలం? కట్టుకుని ఆడదాయే యిలా మోసంసేసింది

నే ఒచ్చేసరికి సూశారా? కడుపొచ్చాయిదీనీ - ఏంసెప్పేదిదొరా! కలికాల మాత్యం!'

*　　*　　*　　*

రైలాగింది వీర్రాఘవులు దిగిపోయాడు

'ఎదవనాయాల - పోతే పోయింది సీ! ఇంకేరివిాదా బ్రమఉంచకూడదు ఛస్ పాలేపోనీ ఎదానిమీద వదలొచ్చేమాంచి పాకుంది ఎగకొడులుకోవాలీ అతను యింటివైపు నడవసాగేడు

'ఓ వీహో హోయ్ ఆగోస్ ఆగకూడదనుకున్నా ఆమె నవ్వులు అతనికాళ్లకు బందాలేశాయి

"ఆగంటే - వీటూ పరుగూ? గౌరి ఆయాసపడుతూవచ్చి

'ఎంతెర్రోడివిరా మాఁవా! అని అతన్ని చూసి నవ్వడం మొదలెట్టింది ఆనల్లనిపెదవులలో ఆ తెల్లనిపళ్లు పియానో మెట్లని జ్ఞప్తికి తెస్తున్నాయి ఆనవ్వుచూస్తే వీర్రాఘవులికి ఒళ్లుమండు కొచ్చింది 'పాప్మని ఓ లెంపకాయ కొడదామా అని ఎంచింది లేకపోతే ఏమిటది? తన్ని ఏడిఎస్తా ఏమిటా వెర్రినవ్వులు?

'నీ అంత బుదితక్కువోడు మరోగు లేడుగంట్రా! అంతల్లోకే అలిగేశావు నీ గౌరిగుణం నీకు తెలత్రా?

'ఇంకా నీగుణం తెలిసేదేమిటే?

'ఏఁవా? ఏఁవా? అతణికీ సచ్చినోడు వాడిజమ్మడి - ఎదురుగుండా కనపడుతున్నదే సెప్పనా తెలుసుకోలేని చవటగోడు - ఉండపట్టి సెప్పలేక పోయాను గాని సరేగాని ఒరే మాఁవా నీ కెలాంటి కొడుకుగావాల్రా?

వీర్రాఘవులికి అసలే ఒళ్లు మండి పోతోంది

'సెప్తానా? సీత్చెయ్యనా? అన్నాడు ఉఱుకుతూ

'అబ్బోసి - అబ్బోసి అంత పాటాడివే? నీకు కడుపునిండా తిండెట్టే కొడుకు నివ్వనా? ఇదా రెండుకళ్లా పెట్టుకు సూడు' గౌరి కడుపులోంచి తొమ్మిది నెలల శిసువ్వూ, నొప్పుల్లేకుండా, ఏడుపు లేకుండా చిన్న బియ్యంబస్తా రూపంలో గౌరిచేతులో బయటకొచ్చేసు వీర్రాఘవులు అనిమిషుడైపోయాడు

'మరేటి సే సేదిరా? నువ్వేతొప్పు ఎలా తెచ్చినా పట్టేసుకుంటున్నారొరెయ్! కడుపులో కట్టేసుకున్నాను నన్నెవడేం సెయ్యగలడూ? ఆడదాన్ని! రాక రాక మవొొస్తున్నావాయే నీకే కెట్టనురా? ఆకలికూడ!' అని గౌరి చాకొక్కలేని వీర్రాఘవులి పొట్టమీద వేలుతో పొడిచింది

'షోవోస్ పెంకినాయాల అని ఆబుద్ధి తక్కువోగు ఆ ఎగులేని ముండని చేతులతో ఎత్తేసి గట్టిగా ముద్దెట్టుకున్నాడు!

★



# ఇంగువకట్టిన గుడ్డ

(8-వ పేజీ తరువాయి)

రైతులు బకాయీలు లేకుండా మక్తాలు ఇస్తే ఇంట్లో రెండుగేదెలపాడి కాలం నిశ్చింతగా గడిచిపోతున్నది

హైస్కూలు పంచాంగం రెండుసార్లు పల్టీకొట్టించిగాని చంకకెక్క లేదు మొదటి యాత్రకుపూర్వమే ఒకసతీమణి అంటూ ఏర్పడటంతో రెండోపల్టీ ఖాయంఅయింది అర్ధాంగిగారి ఈ సడింపులతో బుర్రబిరుసెక్కి లోపలకుజారిన రెండుముక్కలనూ బైటకు పోకుండాఆపి మూడోసారి గట్టెక్కించింది కాలేజీగేట్లను, మొదట పల్టీతోనే బహిష్కరించాం గనుకనున్నూ నౌకరీచేసేగతి నాకేం పట్టిందని ఇదివరకే తీర్మానించుకున్నాంగనుకనున్నూ, రాజకీయాలలో ముసలిరక్తం వైదొలిగి యువక రక్తానికి తావివ్వాలనే వాదనను అంగీకరించాం గనుక నున్నూ దేశభక్తుడు అనిపించుకునే ప్రతివాడికి ఆదర్శాలుగా ఉండే అనేకములైన వాటిలో గ్రామోద్ధరణ మహా తేలికగా, చౌకగా, అందుబాటులో ఉన్నట్లు కనబడుటవలననున్నూ, మా శ్రీవారితోసహా మాఊరిలో మకాం స్థిరంచేశాను

ఐదారు సంవత్సరాలు నిర్విఘాతంగా సాగినఇంజను డ్రైవరుకు తెలియకుండానే బ్రేక్ పడ్డది ఖాళీబ్రేక్ పడితే అంత తికమక ఉండకపోను బండి వెనక్కు నడవటంతో గాభరా ఎక్కువైంది క్రితసాలువరకూ, ఏ అడ్డంకీ లేకుండా మక్తాలు చెల్లించిన రైతులు ఈనాడు ఎగనామం పెట్టారు రైతు జనాభ్యుదయ కాముకులము, దున్నేవాడిదేభూమి అని వాదిస్తూ వచ్చాం గనుక ఈనాడు మక్తాలు తగ్గింపు లేకుండా కట్టి తీరవలసిందేనని గట్టిగా పట్టు బట్టటానికి నైతికమైన ఇబ్బందికి లోనుకావలసివచ్చింది, కనీసం ప్రభుత్వంవారు బకాయీలను ఇప్పించేవరకు ఇంతవరకూ వారి హక్కులకై పోరాడిన, కనీసం వారి ముందు ఇతరులతో వాదించిన మనకు గూడా మక్తాలు ఇవ్వరా అనే ధైర్యం ఉండేది ఇది కాకుండా మరా రాజకీయాలలో ఎదురుపార్టీ వారిద్దరికి ధాన్యం కొలవవద్దని రైతుల్ని ముందాలోచన లేకుండా ప్రోత్సహించాను కూడా ఈనాడు నేను తవ్వుకొన్న గోతిలో నేనే పడ్డా గింజలంటూ ఇంటికిజేరితే నేగాని గడవని సంసారం మరి

కాళ్లు ముడుచుకు కూర్చుంటే ఏమయినట్టు అన్న ప్రశ్న ప్రత్యక్షమైంది కనీసం ధాన్యం ఇంటికి చేరేవరకైనా నాటకం ఆడాలా? స్కూలు విడిచి పదేళ్ళయినా ఇప్పటివరకూ ఉద్యోగ ప్రసక్తే దగ్గరకు జేరనివ్వని నాకు ఈనాడు ఉద్యోగం ఎవరుఇస్తారు? పోనీ పల్లెపట్టుగదా, నలుగురి పిల్లలకు ఓనమాలు దిద్దపెట్టుకుందామా అంటే మన పాండిత్యం లోకవిదితం ఒకర్ని ఆలోచన అడుగుదామా అంటే ఇంతవరకు ఒకరికి సలహాచెప్పిన ధీశాలులం మనకు ఆత్మాభిమానం అడ్డొచ్చింది పైగా భుక్తిమార్గానికే ఒకర్ని సలహా అడగొచ్చేటప్పటికి చచ్చినంత పనైంది

ఇంట్లో శ్రీవారి గొడవ ఆరోజుకారోజు ఎక్కువైంది దమ్మిడీ సంపాదన లేదన్నమాట నిజమే కాని ఆమాటనే చెసుకొన్న పెండ్లాం రోజుకు ఇరవైసార్లు దెప్పి పొడుస్తుంటే భరించటం కష్టమయింది నేను ఎక్కడ తిరిగినా, ఎందుకు తిరిగినా, అన్నీ ఆరాలు తనకు కావాలి నాకు స్వతహాగా తెలివితేటలు శూన్యమని, ప్రతివిషయంలోను తన సలహా నేను పాటించాలని ఆవిడగారి పాయింటు కాని భార్యారత్నంగారి సలహాప్రకారం నడుచుకుంటుంటే ఏనాటికైనా నికార్సైన పత్నీవ్రతుణ్ణనే పేరు పాకిపోతుందనే భయం ఒకమూల పీడిస్తుంది అయినా ప్రతిదానికి ఆడదాని సలహా ఏమిటన్న పురుషకారం ఒకటుంటూ ఉంటంతో మా ఇంటావిడితో ఏ విషయంగూడా సంప్రదించే అలవాటు చేసుకోలేదు

ఇన్ని కారణాలుగా పట్నం జేరవలసి వచ్చింది అప్పట్లో ఆపూళ్ళో వేలువిడిచిన మేనమామ అంటూ ఒకరు లేకపోతే ఏమయ్యేదోగాని అప్పుడు మాత్రం ఒక సంపాదన పరుణ్ణయ్యాను నెలకు అరవైరూపాయల జీతం తిండీ బట్టా జరిగిపోతున్నాయ్ వచ్చిన మక్తాగింజలు వెనుక వేసుకున్నాను

రోజులు అవిఘ్నంగా తోసుకొచ్చాయి రాజకీయ ప్రవేశం ఒక నిషాలాంటిదని ఆనాడు గ్రహించగల్గాను ఈమధ్య సంసారం ఎట్లా జరుగుతుందా అన్న తాపత్రయంలో మగ్గునపడ్డ రాజకీయ విషయ చర్చా వాంఛ తిరిగి ఉద్యోగంలో చేరిన తరువాత తలెత్తింది పార్కుల్లో నలుగురిలో వాదించటంతోనే అప్పట్లో తృప్తిపడ్డా నేను ఒక తీవ్రవాదిననేపేరు సంపాదించుకున్నాను ఈబిరుదు ఆ నోటా ఆనోటాపడి మా మేనేజరువరకూ వెళ్లింది చెడ్డరోజులు వస్తే ఆపటం బ్రహ్మతరమా అని తరువాత జరిగిన మాకంపెనీ సమ్మెలో మనకు ఈషన్మాత్రం జోక్యం లేకపోయినా ఉద్యోగంమాత్రం రక్షీమని ఊడింది ఆ తర్వాత ఈనాటివరకూ నేను ఎక్కని ఆఫీసుగుమ్మం అంటూ లేదు, ఉద్యోగ నిమిత్తం పాపం, మా మామయ్యకూడా శతవిధాల ప్రయత్నించాడు కాని ఫలితం లేకపోయింది

“అంటే ఇక మీరు ఉద్యోగం చెయ్యరన్నమాట” అందుకుంది మాఆవిడ ఒక మంచిరోజు చూసి

“చెయ్యనన్నానుటే, నీ పిచ్చికాని, రోజులు కలిసిరావాలి”

ఉన్నదాన్ని నిలపెట్టుకున్నారు, ఇక రాబోయేదాన్ని వెలగపెడతారు అయ్యో గీత! పూజకొద్దీ పురుషులు! ఇదేచెప్తున్నా, ఈరోజునుండి ఒకపూట వంట మీద అడైనా నేర్చుకోండి మాకక్కయ్యగారు భార్యని పురిటికి పంపిస్తాడట వంట మనిషి కావలసిఉంటుంది ఏదో ఒక ఉద్యోగం” అని తేల్చేసింది

ఈముల్లుపోటు మంథర పర్వతమై నాహృదయజలధిలో మథనం ప్రారంభించింది ముందుగా గృహపరిత్యాగం అనే హాలాహలంలో మునిగిపొయ్యాను ఇక మీదైనా అమృతప్రాప్తి ఉందో? ఉంటే, ఎటువంటిదో? ★




# సహకారం

శ్రీ రెంటాల గోపాలకృష్ణ

ఉదయపురము ఊరిబయట
ఉండెనొక్క పూరిపంచ
బిచ్చగాండ్ల గుంపుఒకటి
అందులోనె నివసించును.

రాజుగారు ఒక్కరోజు
భోజనాలు పెట్టదలచి
బిచ్చగాండ్ర రండటంచు
పెద్దగ చాటింపుచేసె.

చాలమంది బీదవారు
వేనవేలు వచ్చినారు.
ఊరిబయటి వారలంత
చేరినారు ఒక్కచెంత.

పూరిపంచలోన తుదకు
మిగిలినారు ముసలివారు—
కుంటికాలు వాడొకండు,
గ్రుడ్డివాడు వేరొకండు

“భోజనాని కెట్లుబోదు?
కానిపించ వాయెకండ్లు”
అంటుగుడ్డి వాడుచాల
కడుపుమండి ఏడ్వసాగె.

“నడవలేను నాగతేమి ?
తోడువారు లేరుసామి
ఎటులుపోదు నటకు”అనుచు
కుంటివాడు గోలచేసె
ఏడ్చిఏడ్చి కొంతసేపు
ఎరుకపడిరి ఒకరికొకరు
“భాయి! భాయి! మనం మనం
చేయిచేయి కల్పుదాము”

గ్రుడ్డివాని వీపునెక్కి
కుంటివాడు దారిచూపె.
కర్రసైగ తోటిగ్రుడ్డి
కాలివడక కదలిపోయె.

రాజుగారి భోజనాలు
కడుపునిండ మెక్కివారు
పూరిపంచ చేరినారు
ఒకరికొకరు దారిచూపి.

“చూచినార! బాలలార!
ఒకరికొకరు సాయపడితె
చేతకాని దేదిలేదు
జగతి గాథ లోన మనకు ”




జరిగిన కథ —

1537 వ సంవత్సరంలో ఇంగ్లండురాజైన హెన్రీకి ఎడ్వర్డ అనే కొడుకూ నిరుపేద జాన్‌కాంటీకి టామ్ అనే కొడుకూ ఒకేరోజున జన్మిస్తారు అదేం విచిత్రమోగాని ఇద్దరిది ఒకేపోలిక ఒకరోజున టామ్ రాజభవనం కేసి వెళ్లగా యువరాజైన ఎడ్వర్డు అతన్ని లోనికి తీసుకుపోయి ఆదరిస్తాడు ఒకరి జీవితం ఒకరు చూడాలనే ఆసక్తితో దుస్తులు మార్చుకుంటారు ఎడ్వర్డు పేదగుడ్డల్లో బైటకురాగానే ప్రజలతన్ని పేదబాలుడుగానే భావిస్తారు అతడు తను యువరాజునంటున్న కొద్దీ అవమానిస్తారు అక్కడ యువరాజువేషంలో ఉన్న టామ్‌ను ఎడ్వర్డే అని అంతా అనుకుంటారు అతడు తను పేదవాడినని చెప్పినా వినరు యువరాజుకే ఎచ్చెక్కినట్లు భావిస్తారు ఈలోగా వృద్ధరాజు హెన్రీ చనిపోవడం యువరాజుగా చెలామణీ అయ్యే టామ్ రాజు కావడం జరుగుతుంది అసలు రాజు ఎడ్వర్డును జాన్‌కాంటీ తన కొడుకేనని భావించి బాధిస్తూఉంటాడు అతని చేతుల్లోంచి ఎడ్వర్డును మైల్స్ హెండన్ అనే వీరయువకుడు రక్షిస్తాడు గాని ఎడ్వర్డు తిరిగి జాన్‌కాంటీకే పట్టుపడతాడు మళ్లీ తప్పించుకుని ఒక నిర్జనారణ్యంలోకి పారిపోతాడు అక్కడ తన తండ్రి పెపగబట్టిన ఒక మతగురువు చేతిలో చిక్కి ప్రాణాపాయానికి లోనవుతాడు కాని దైవవశాత్తు తిరిగి జాన్‌కాంటీకి బందీ అవుతాడు ఇక చదవండి

అనువాద
శ్రీ
నండూరి రామమోహనరావు

"హోహో హిహీ చక్రవర్తి" పరిస్థితి మళ్ళీ మొదటి కొచ్చింది దొంగలముఠాకు మళ్లీ బందీ అయ్యాడు ఒకసారి తమనుండి తప్పించుకు పోయాడనే అక్కసు కొద్దీ ముఠావాళ్లు బాలరాజును ఇంకా ఏడిపించడం ప్రారంభించారు అయితే జాన్‌కాంటీ హ్యూగోలకు తప్ప మిగతా వారెవరికీ అతనిమీద నిజంగా ద్వేషం లేదు ఉరికే వేళాకోళానికి ఉడికిస్తున్నా, అందరికీ అతనంటే అవ్యాజానురాగం ఏర్పడింది అతనిధైర్యం, హుందాతనం చూసి వాళ్లకు కనీసం మనస్సులోనైనా అభిమానం ఏర్పడింది

ముఠా నాయకుడు దగ్గర

లేనప్పుడు కాంటీ, హ్యూగోలు బాలరాజును తెగతిప్పలుపెట్టేవారు, అతని రాజరికాన్ని అవమానించే వారు. హ్యూగో మరీని, ఉత్తిపుణ్యానికి, ఒంటికాలిమీద లేచేవాడు. ఒకసారి పొరపాటున తొక్కినట్లు బాలరాజుకాలు తొక్కాడు బాలరాజు చూసీ చూడనట్టు ఊరుకున్నాడు హ్యూగో ఇంకోసారి అలాగే తొక్కాడు బాలరాజు ఇంకా ఓర్పు విడవకుండా మౌనం వహించి కూర్చున్నాడు కాని, హ్యూగో మూడోసారి కూడ ఆకతాయిగా ప్రవర్తించేసరికి బాలరాజు కోపం పట్టలేకపోయాడు. పక్కనున్న దుడ్డు కర్ర తీసుకుని ఒక దెబ్బతో హ్యూగోను పడగొట్టాడు ఈదృశ్యంచూసి దొంగలు సంతోష పరవశులై చప్పట్లు చరిచారు "హాహా హీహీ చక్రవర్తికీ జై" అనే నినాదాలు మిన్నుముట్టాయి హ్యూగోకు చచ్చినంత పనయింది పదేళ్ల బాలుని చేతిలో, ఇందరి ముందు, అంత దుర్భర పరాభవం జరిగితే ఎలా సహించగలడు? తోక తొక్కిన తాచులా లేచాడు, దుడ్డు కర్ర పుచ్చుకుని కుందేలుపైకి లంఘించే సింహంలా మీదికురికాడు

మన దొంగలకి ఇలాంటి ద్వంద్వ యుద్ధాలంటే సరదా మిక్కుటం వెంటనే వీరద్వయంచుట్టూ చక్రాకారంలో మూగారు, ఈపోరాటపు పర్యవసానం కళ్లారాచూసి ధన్యులు కావాలనే ఆసక్తితో "అయ్యో! ముక్కుపచ్చలారని పసివాడే అతన్ని రక్షించడం మన ధర్మం కదా," అనేధ్యాస ఎవడికీ లేదు. ఒకడు పిల్లకోడే గెలుస్తుందని, మరొకడు పెద్దకోడే నెగ్గుతుందని పందెం కాశారు

హ్యూగో మీది కురికీ ఉరకడంతోనే బాలరాజు పక్కకు తొలిగి బుర్రమీద మరో దెబ్బ తాటించాడు హ్యూగో గిర్రున తిరిగి మళ్లీ పడ్డాడు బాలరాజు రాచనగరులో పట్టుతివాసీల మీద, మెత్తటి పచ్చిక దారులమీద తప్పటడుగులు వెయ్యడం నేర్చుకున్నప్పటి నుంచీ మహావీరులమధ్య మెలిగాడు, యూరప్ ఖండంలో అగ్రేసరులని పేరుగాంచిన నిపుణుల వద్ద కత్తిసాము క్షుణ్ణంగా అభ్యసించాడు. ఖడ్గయుద్ధంలోను, ధనుర్విద్యలోను అతనికి తెలియని మెలకువలు, రహస్యాలు లేవు అటువంటివాని చేతికి కర్ర ఇస్తే, హ్యూగోలాంటి దేశద్రిమ్మరులు, తాగుబోతులు ఏపాటి నిలుస్తారు?

హ్యూగో వళ్లు దులుపుకుని లేచి వీరావేశంతో కిందూ మీదూ లేకుండా కర్రతో మోదుతున్నాడు బాలరాజు తొణుకూ బెణుకూ, అలసట, ఏమీ లేకుండా రీవిగా నిలబడి ఒక్క దెబ్బకూడా తగలకుండా తప్పుకుంటున్నాడు హ్యూగో ఎక్కడ కొట్టబోతే అక్కడ కర్ర అడ్డంపెట్టి కాచుకొంటున్నాడు ఇంత గొప్ప నైపుణ్యం దొంగలిదివరకెన్నడూ, ఎక్కడా చూడలేదు నోరు తెరుచుకుని విభ్రాంతులై బాలరాజు విద్యను తిలకిస్తున్నారు

ఈరీతిగా ఒక పావుగంటకు పైగా ద్వంద్వయుద్ధం జరిగింది. బాలరాజుకు ఒక్క దెబ్బయినా తగలేదు. కాని హ్యూగోకు మాత్రం కాళ్లమీద, మణికట్లమీద, ముడుసులమీద, నెత్తిమీద విపరీతంగా గాయాలు తగిలాయి శత్రువు కాపు పెట్టుకోని చోటనల్లా బాలరాజు రంగున గురితప్పకుండా కొట్టాడు హ్యూగో కిందపడితే లేవలేని స్థితికి వచ్చాడు. ఆఖరుసారిగా ప్రయత్నిద్దామని కర్ర ఎత్తాడుగాని బాలరాజు బలంకొద్దీ కొట్టి కర్రను రివ్వున దూరానికి ఎగరగొట్టాడు. ఆయుధం పోగానే ఇక లాభం లేదని గ్రహించి హ్యూగో వెన్నిచ్చి

(26-వ పేజీ చూడండి)

ఇల్లా ఉండగా ఓరోజున రాజుగారిదగ్గరనుంచి ఆహ్వానలేఖ వస్తుంది. ఏమనీ? "దేశంలో యుక్త వయస్సువచ్చిన ఆడపిల్లలందరూ, రాత్రి కోటలోజరిగే నృత్యోత్సవానికి రావాలి; రాజకుమారుడు తనకునచ్చిన పిల్లతో నృత్యం చేస్తాడు; ఎవరితో నృత్యంచేస్తే ఆమెనే పెళ్లిచేసుకొంటాడు," అని. సవతిచెల్లెళ్లు కొత్తబట్టలు వేసుకుని ముస్తాబవుతారు. కాని సిండరెలాకు మచ్చుకొకటైనా మంచిబట్టలేదు. మరి ఎలా వెడుతుంది?

"సి
వాల్ట్ డి
ఆర్. కే.





రెలా”
ార్టూన్‌చిత్రం
డిసెంబరువిడుదల

చిట్టెలుక లిది గ్రహించి తమ మిత్రురాలికి ఏఫాషన్‌లో గౌనుకుట్టితే బావుంటుందాఅని కాలు విరగేస్తాయి కుట్టుపరికరాలు సంపాదించి చక్కని గౌనుతయారుచేస్తాయి సిండ అదిధరించి రాచనగరుకు తనూబయల్దేరుతుంది కాని సవతిచెల్లెళ్లు సిండరెలావస్తే రాజకు డామెనే వరిస్తాడని ఓర్చలేక ఆ గౌను చింపేసి పోగులు పెడతారు తల్లితోకలిసి వాళ్లు రెలాను వదిలిపెట్టి వెడతారు



గుంపులోంచి దూసుకుని పారిపోయాడు.

"పిల్లకోడి గెలిచింది, పిల్లకోడి గెలిచింది," అనే కేకలతో ప్రేక్షకులు బాలరాజును ఎత్తేశారు. ఒకడు అతన్నెత్తుకుని బుజాలమీద కెక్కించుకున్నాడు జయ జయ ధ్వానాలతో, అతన్ని మురా నాయకునివద్దకు తీసుకుపోయి అతని పక్కన కూర్చుండబెట్టారు. నాయకుడు "హాహా హీహీ చక్రవర్తి" గుణ గుణాలను, శౌర్యాన్ని ప్రశంసిస్తూ గంభీరోపన్యాస మిచ్చాడు. అతనికి "ఆంగ్ల కేసరి" అనే బిరుదిచ్చాడు. "హాహా హీహీ చక్రవర్తి" అనే పేరు ఏడిపించడానికి మాత్రమే పెట్టింది గనుక దాన్ని ఇకమీదట ఎవరైన వాడారంటే మురానుంచి బహిష్కరించేస్తానన్నాడు.

"ఆంగ్ల కేసరిని" ఏ వృత్తిలో ప్రవేశపెడదామన్నా సాధ్యం కాలేదు. ఒకసారి ఒకళ్లవంటయింట్లోకి పంపారు ఏదన్నా ఎత్తుకు రమ్మని. అతడు వట్టిచేతులతో తిరిగి రావడమే కాకుండా ఇంటివాళ్లతో చెప్పి బయటపెడతానని బెదిరించాడు కూడా గిన్నెలమాట్లవాడితో పంపించారు సహాయం చేస్తూ ఉండమని. కాని బాలరాజు వేలైనా కదల్చలేదు సరిగదా, సుత్తితో తల పగలగొడతానని మాట్లవాణ్ణి హడలగొట్టాడు హ్యూగోతో పంపించారొకసారి బిచ్చమడుక్కోడానికి. అతడు దిక్కులు చూస్తూ నుంచున్నాడు గాని నోరైనా మెదపలేదు. అంతేకాక వీలైనప్పుడల్లా తప్పించుకు పోవడానికి ప్రయత్నించాడు కాని అతని ప్రయత్నాలేమీ ఫలించలేదు. ఈవిధంగా కొన్ని రోజులు గడిచాయి

ద్వంద్వ యుద్ధం జరిగిన రోజు నుంచీ హ్యూగో బాలరాజుపై తాచుపాములా పగబట్టాడు. కాని బహిరంగంగా పగతీర్చుకునేందుకు అవకాశం దొరకడంలేదు. అందుచేత వాడు ఉపాయాలమీద ఉపాయాలు ఆలోచిస్తున్నాడు ఆఖరికి రెండు ఉపాయాలు స్థిరపరుచుకున్నాడు ఒకటి బాలరాజును శాశ్వతంగా అవమానం కల్గించే పని చెయ్యాలి రెండు మొదటిది కుదరని పక్షంలో, బాలరాజుమీద ఏదో నేరంతోసి రక్షకభటులకు పట్టుబడేట్లు చెయ్యాలి.

మొదటి ఉపాయం ఇది బాలరాజు కాలిమీద "పుండు" పడేట్లు చెయ్యాలి పుండుపడటానికి దొంగబిచ్చగాళ్లు ఒక విచిత్ర పద్ధతి నవలంబిస్తారు పచ్చిసున్నం, సబ్బు, ఇనుముతుప్పు ఈ మూడూ కలిపి 'పేస్టు' తయారు చేస్తారు. దాన్ని తోలుముక్కమీద ఒత్తుగా రాసి కాలికి పట్టీ వేస్తారు కొద్దిసేపట్లో 'పేస్టు' పని చేయడం మొదలుపెడుతుంది చర్మం మంట పెడుతుంది, తరువాత పగుల్తుంది, అప్పుడు పట్టీ విప్పేస్తారు చర్మం పగిలినచోట నెత్తురు పూస్తారు. నెత్తురెండిన తర్వాత ఆ ప్రదేశం ఎర్రటి వ్రణంలాగ చూట్టానికి భయంకరంగా ఉంటుంది. ఈ అవతారంతో వీధుల్లో తిరుగుతూ దారేపోయేవాళ్లను ధర్మం అడుగుతారు. జాలి గుండెలుగలవాళ్లు హృదయం కరిగి ధర్మం చేస్తారు. జాలిలేనివాళ్లు బిచ్చగాడి పీడ వదిలించుకోవాలనైనా, చీదరించుకుంటూ పారేస్తారు

ఒకరోజు మధ్యాహ్నం మురావాళ్లు ఎవళ్ల వృత్తులమీద వాళ్లు పోయాక హ్యూగో మాట్లవాణ్ణి కూడా తనప్లానులోకి తీసుకున్నాడు. మాట్లవాడికి కూడా బాలరాజుమీద కంఠందాక కోపం ఉంది. ఇద్దరూ కలిసి బాలరాజును ఆమాట ఈమాట చెబుతూ చెట్లచాటుకు తీసుకుపోయారు. అక్కడ బాలరాజును పడేసి కాళ్లూ, చేతులూ, నోరు కట్టేశారు. హ్యూగో కాలికి పట్టీ కట్టాడు బాలరాజు ఎంత గింజుకున్నా లాభం లేకపోయింది 'పేస్టు' చర్మాన్ని కరవడం మొదలెట్టింది

ఇంతలో అదృష్టవశాత్తు అక్కడికొక మనిషి రావడం, బాలరాజుకు అపాయం తప్పిపోవడం జరిగింది అతడెవరో కాదు. ఆ రోజున ఇంగ్లీషు శాసనాలని విమర్శిస్తూ ఉపన్యాసం దంచిన "బానిస" యే, అతడు జరుగుతున్నదంతా క్షణంలో గ్రహించి పట్టీ విప్పేసి కాలు శుభ్రంగా కడిగాడు

బాలరాజు 'బానిస" చేతిలో ఉన్నకర్ర లాక్కుని హ్యూగోను, వాడి స్నేహితుణ్ణి ఉతకాలని దూకాడు కాని "బానిస" అడ్డపడి వారించాడు ఆ రాత్రి మురా అంతా సమావేశమైనప్పుడు హ్యూగో కుట్రను నాయకుని

కొరుకపరచాడు అతడు కుట్ర దారులను మందలించి, ఇకమీద బాలరాజును బిచ్చానికి తీసుకు పోవద్దని, దొంగతనాలకే తీసుకు పొమ్మని ఆజ్ఞాపించాడు

మందలింపుతో వదిలిపోయినందుకు హ్యూగో సంతోషించాడు. ఇదివరకల్లా బాలరాజును చౌర్య వృత్తిలోకి దింపాలని ఎన్నిసార్లు ప్రయత్నించినా లాభం లేక పోయింది ఈసారి సాక్షాత్తు అధిష్ఠానవర్గంవారే ఆజ్ఞాపించారు కనుక బాలరాజు ఆజ్ఞ ఉల్లంఘించడానికి వీల్లేదు.

అందుచేత హ్యూగో బాలరాజును వెంటబెట్టుకుని ఆమర్నాడు మధ్యాహ్నమే దొంగతనానికి బయల్దేరాడు అతడు ఎలాగోలాగు పోలీసులకు పట్టుపడేలా చెయ్యాలని హ్యూగో ఎత్తువేశాడు అయితే తనే పట్టిచ్చినట్లు ముఠావాళ్లకు అనుమానం కలక్కుండా చెయ్యాలి. ఎందుకంటే "ఆంగ్లకేసరి" మీద ముఠాలో అభిమానం జాస్తి అవుతోంది తన ద్రోహం తెలిస్తే వాళ్లూరుకోరు.

హ్యూగో బాలరాజుతో ఒక ఊళ్లో ప్రవేశించాడు దూరంగా ఒక పొట్టి ఆడమనిషి నెత్తిమీద ఏదో తట్టపెట్టుకుని రావడం చూశాడు

"ఆ తట్టలో ఏదో ఉన్నట్లుంది. కాచుకోరా ఆంగ్లకేసరి! నా తడాఖా," అని మనస్సులో అనుకున్నాడు ఇంతలో ఆ స్త్రీ దగ్గిరకొచ్చింది ఆమెను దాటిపోనిచ్చాడు మెల్లిగా వెనకాలే వెళ్లి తట్టలోని మూటను సంగ్రహించి బాలరాజు చేతికిచ్చి "నువ్వు నా వెంటే పరుగెత్తుకురా," అని చెప్పాడు. తను పరుగు పుచ్చుకున్నాడు. ఇంతలో ఆడమనిషి నెత్తిమీద బరువు తగ్గిపోవడం గమనించి మూటనెవరో దొంగిలించారనుకుంది. "దొంగలరోయ్ రండరోయ్" అని గావుకేకలు పెట్టింది వెనక్కి తిరిగి చూసేసరికి, బాలరాజు చేతిలో మూట ఉండడం చూసి పరుగెత్తుకు వచ్చి అతని చెయ్యి పట్టుకుంది ఆమె అరుపులకు వాళ్లూ వీళ్లూ పోగడ్డారు ఇదంతా కన్నుమూసి కన్ను తెరిచేటంతలో జరిగిపోయింది. బాలరాజు మూట పారేసి పారిపోవడానిక్కూడా సందు చిక్కలేదు. హ్యూగో పన్నాగం కొంతసేపటికి గాని అర్థంకాలేదు పారిపోవడానికి ప్రయత్నించాడు కాని ఆ స్త్రీ భల్లూకపుపట్టు పట్టేసింది పైగా జనం కూడా గుమిగూడారు

హ్యూగో ఇదంతా చాటున దాక్కుని చూస్తున్నాడు ఇక అతడు చూడదగిందేదీ లేదు శత్రువు రక్షకభటులకు పట్టుబడడమే తరువాయి అందులో అనుమానమేమీ లేనందున చూడవలసిన అవసరము లేదు. కనుక చల్లగా జారుకున్నాడు అక్కడినించి.

బాలరాజు కోపంగా అన్నాడు: "విడిచిపెట్టు మూర్ఖురాలా! నీ మూట దొంగిలించింది నేను కాదు"

కాని అతడెంత గుంజుకున్నా ఆడమనిషి పట్టు విడవలేదు పోగడ్డ జనులు బాలరాజును ఏకవరసన బూతులు తిడుతున్నారు. వాళ్లలో



ఒక వడ్రంగి ఉన్నాడు. అతడు మహోద్రేకంతో చొక్కా చేతులు పైకి లాగి, తేలుకొండిల్లాంటి మీసాలు మెలిపెట్టి, "ఒరే దొంగ వెధవా! నిన్ను పచ్చడి చేస్తారా," అంటూ లంఘించాడు కాని అదే క్షణంలో ఒక పొడవైన కత్తి అతని బుజాన్ని నెమ్మదిగా తాకింది. వడ్రంగి హడలిపోయి వెనక్కి తిరిగాడు

"తొందరెందుకు మిత్రులారా! ఆ పిల్లవాడేదన్నా తప్పు చేస్తే న్యాయాధికారులకు అప్పగించాలి గాని మనంతట మనమే చెయ్యి జేసుకుంటే ఎల్లా? అమ్మో! అతడెక్కడికి పారిపోడు. వదిలి పెట్టు."

ఈమాట లంటున్న యువకుణ్ణి వడ్రంగి నఖశిఖపర్యంతం పరిశీ

లించాడు ఆ బట్టు, పౌరుగు, వీర లక్షణాలు, చేతిలో ఖడ్గం-ఇవన్నీ చూసి కంగారుగా పక్కకి తప్పు కున్నాడు చేసేకాని కోపంతో చేతులు దులుపుకుంటూ అవతలికి వెళ్లిపోయాడు ఆడమనిషి ఇష్టంలేక పోయినా బాలరాజు చెయ్యి విడిచి పెట్టింది మిగతా జనులు అతన్ని ద్వేషం నిండిన చూపులు చూశారు గాని ఎవడూ నోరెత్త సాహసించ లేదు బాలరాజు తన మిత్రుణ్ణి ఒక్కఅంగలో చేరుకుని,

"ఎక్కడికి పోయావ్ సర్ మైల్స్! నన్ను వదిలి ఎందుకు పోయావ్ సర్ మైల్స్!" అని గద్గద కంఠంతో అడిగాడు

## 25

హెండన్ చిరునవ్వు నవ్వాడు బాలరాజు చెవిలో ఇలా గన్నాడు

"మహారాజా! గట్టిగా మాట్లాడ కండి నన్ను నమ్మండి చివరికి అంతా శుభాంత మౌతుంది" తనలో ఇలా గనుకున్నాడు "సర్ మైల్స్! అరె నాకు సర్ బిరుదం ఉన్నట్టే జ్ఞాపకంలేదు ఈ బాలుడు ఇంత వెర్రివాడైనా అన్నీ జ్ఞాపకం వుంచుకుంటున్నాడు. ఇది ఉత్తుత్తి బిరుదమే కావచ్చు కాని యూరపు లోని కొన్నికొన్ని నిజమైన రాజ్యాల్లో సామంత ప్రభువుగా ఉండడంకంటే ఇతని స్వప్న రాజ్యంలో 'సర్' ని కావడంలోనే ఎక్కువ ఆనందం ఉన్నది"

గుంపును చీల్చుకుంటూ క్రోధారుణ నేత్రుడైన కాన్‌స్టేబిల్ ఒకడు వచ్చాడు మోటుగా బాలరాజును రెక్కపట్టుకు లాగబోయాడు-కాని హెండన్ వారించి అన్నాడు

"నెమ్మదిగా మిత్రమా! నువ్వు తన్ని లాగనక్కరలేదు. అతడే వస్తాడు. నేను పూచీ వుంటాను కావలిస్తే నువ్వు ముందు నడు.

కాన్‌స్టేబిల్ ఆడమనిషిని, బాలరాజును వెంటపెట్టుకుని బయల్దేరాడు హెండన్ అనుసరించాడు బాలరాజు ఎదురు తిరుగుదామనుకున్నాడు గాని హెండన్ హెచ్చరించాడు

"మహారాజా! తమరే రాజ శాసనాలను ఉల్లంఘిస్తే మాబోటి వారి నిక అనే పనేముంది?"

"అవును నువ్వన్నది నిజం ఇంగ్లండు సార్వభౌముడు ఈరోజున అదృష్టవిహీనుడు, సామాన్యులలో సామాన్యుడు ఇతర ప్రజలందరూ రాజశాసనాలకు ఎలా తల ఒగ్గాలని తలుస్తానో, అలాగే నేను కూడా ప్రజల్లో ఒకణ్ణిగా ఉంటున్నాను గనుక శాసనాలను శిరసా వహిస్తాను"

న్యాయమూర్తి అడిగిన ప్రశ్నలకు జవాబుచెబుతూ ఆడమనిషి "ఈకుర్రవాడే నామూట దొంగలించాడు," అన్నది కాదని సాక్ష్య మిచ్చే వారెవరూ లేనందున బాలరాజే దొంగ అని స్థిరపడింది మూట విప్పిచూడగా అందులో వంటకు సిద్ధం చేయబడిన పంది పిల్ల ఉన్నది అది చూసి జడ్జిగారు ఆందోళన చెందారు, మైల్స్ హెండన్ ముఖం పాలిపోయింది బాలరాజు మాత్రం సంగతేమీ తెలియనందున అమాయకంగా నుంచున్నాడు. జడ్జిగారు ఆడమనిషి నడిగారు

"అమ్మా! దీని ఖరీదెంత?"

"మూడు షిల్లింగుల ఎనిమిది పెన్సులండి"

జడ్జి ఆందోళన ఇంకా ఎక్కువైంది కోర్టులో చేరిన జనసమూహాన్ని పరిశీలించి చూసి కాన్‌స్టేబిల్‌కు ఆజ్ఞాపించారు

"అందర్నీ బయటికి పంపించు ఒకసారి"

కోర్టులో జడ్జి, కాన్‌స్టేబిల్, ముద్దాయి, ఫిర్యాది, మైల్స్ హెండన్ తప్ప ఎవరూ లేరు జడ్జి ఫిర్యాది కేసి తిరిగి అన్నారు

"అమ్మా! పాపం ఏదో తెలియకచేశాడు పిల్లవాడు ఆకలికి తాళలేక దొంగతనానికి దిగాడేమో గాని బుద్ధిపూర్వకంగా చెయ్యలేదనుకుంటా అతని ముఖం చూడు, ఎంత నిర్మలంగా, అమాయకంగా ఉన్నదో? నీకు తెలుసుగా పదమూడున్నర పెన్సులకంటే ఖరీదైన వస్తువును దొంగిలిస్తే దొంగకు మరణశిక్ష పడుతుంది పాపం ఈ కుర్రవాణ్ణి ఎందుకు ఉరి తీయిస్తావు?"

బాలరాజు అదిరిపడ్డాడు కాని నిగ్రహించుకుని నిబ్బరంగా నుంచున్నాడు కాని ఫిర్యాది నిబ్బరించుకోలేక గడగడ వణికి పోయింది

"అయ్యో నాకడుపు కాలా అయ్యో నన్ను పాతిపెట్టా. ఎంత పాపిష్టిదాన్ని! బంగారం లాంటి కుర్రాణ్ణి ఉరితియ్యనిస్తానా? నా ఆస్తి అంతా దొంగిలించినా

ముద్దొచ్చే ఈ బంగారు పాపణ్ణి కసాయివాళ్లకు ఒదిలేస్తానా? బాబూ, జడ్జిగారూ! మీరే చెప్పండి, ఏం చెయ్యమంటారో?"

జడ్జిగారు గంభీరంగా అన్నారు

"ఖరీదేమైనా తగ్గించడానికి వీలుందేమో చూడు ఇంకా నేను ఫిర్యాదును కాగితం మీద కెక్కించలేదు"

"బాబ్బాబు, మీ కడుపు చల్లగా మంచిమాట చెప్పారు ఎనిమిది పెన్నీలని చెప్పి రాసుకోండి"

మైల్స్ హెండన్ సంతోష పరవశుడయ్యాడు "మహారాజును" తాకరాదని కూడా మరచిపోయి బాలరాజును ఎత్తుకుని కౌగలించుకుని ముద్దెట్టుకున్నాడు

ఆడమనిషి తన పందిపిల్లని తీసుకుని బయటికి వెళ్లిపోయింది కాన్‌స్టేబిల్ కోరచూపులు చూస్తూ తలుపు తెరిచి తనుకూడా ఆమె వెంట వెళ్లాడు జడ్జిగారు ఫిర్యాదును కాగితంమీద రాసుకుంటున్నారు

కాన్‌స్టేబిల్ అవతలి కెందుకు వెళ్లాడో కనిపెట్టాలని మైల్స్ హెండన్ కూడా కోర్టుహాల్లోకి నడిచాడు నిశ్శబ్దంగా చాటున నుంచుని కాన్‌స్టేబిల్, ఆడమనిషి చేస్తున్న సంభాషణ విన్నాడు

"చాలా బావుందమ్మా పందికూన మంచి రుచిగా ఉండేట్టుంది నేను కొంటాను ఇదిగో ఎనిమిది పెన్నీలు"

"ఇదేంటయ్యోవ్? ఎనిమిది పెన్నీలిస్తానంటావ్? మూడు షిల్లింగుల ఎనిమిది పెన్నీలుపెట్టి పొద్దునే కొన్నాను—కాస్తా కూస్తా అనుకున్నావేమో? ఎవళ్లక్కావాలి నీ ఎనిమిది పెన్నీలు?"

"మరి జడ్జిగారిదగ్గర ప్రమాణం చేసి చెప్పావే ఎనిమిది పెన్నీలని? పద అయితే కోర్టులోకి అబద్ధమాడినందుకు నీకు జుల్మానా, దొంగిలించినవాడికి ఉరిశిక్ష—"

"ఆగవయ్యా, చాల్లే. ఆ చిట్టివాణ్ణి ఉరితీయిస్తావా? ఆ ఉసురు నాకు చుట్టుకోదూ? సరే, తీసుకో కర్రోకటకుడిలాగ తగులుకున్నావ్"

ఆడమనిషి వెళ్లిపోయింది హెండన్ ఏమీ ఎరగనట్టు కోర్టు గదిలోకి వెళ్లి నుంచున్నాడు కాన్‌స్టేబిల్ పందిపిల్లను ఎక్కడో దాచివచ్చాడు జడ్జిగారు రిపోర్టు, తీర్పు రాసుకుని, బాలరాజుకు ఒకరోజు ఖైదు, ఖైదుఅయిన తర్వాత బహిరంగంగా పది కొరడాదెబ్బలు శిక్షవిధించారు. బాలరాజు తీర్పువిని ఆగ్రహావేశుడయ్యాడు. "ఈ జడ్జితల నరికెయ్యండి," అనే మాట నాలిక చివరిదాకా వచ్చింది కాని హెండన్ మళ్లీ వారించాడు

కోర్టు ముగిసింది కాన్‌స్టేబిల్ బాలరాజుతో జైలుకు బయలుదేరాడు హెండన్ అనుసరించాడు కోర్టు ఆవరణ దాటి రోడ్డుమీదకు వచ్చారు బాలరాజు ఆగి హెండన్‌తో అన్నాడు

"బుద్ధిహీనుడా! జైల్లోకి వెడతాననే నీ ఉద్దేశ్యం?"

"ష్ మాట్లాడకండి నాలో మీకు నమ్మకం లేదా? మీరు మామూలు ధోరణిలో మాట్లాడితే కథ రసాభాసం అవుతుంది జరిగేది జరక్కమానదు మీ కిష్టమైనా, కాకపోయినా చివరికి అంతా శుభాంతం అని నేను హామీ ఇస్తున్నాగా"

## 26

అప్పటికి సాయంకాలమైంది గూళ్లకు పక్షులు, ఇళ్లకు మనుషులు చేరుకుంటున్నారు చలిగాలి విజృంభిస్తోంది కాన్‌స్టేబిల్ ఖైదీతో సహా నాలుగురోడ్లు కలిసే ఒక చోటుకు వచ్చాడు జైలు మరికొన్ని గజాలదూరంలో ఉంది జనం అట్టే లేరు చుట్టుపక్కల హెండన్ కాన్‌స్టేబిల్ భుజంమీద చెయ్యివేసి ఆపి రహస్యంగా అన్నాడు

"మిత్రమా! కాస్తాగు, ఇక్కడెవరూ చూసేవాళ్లు లేరు ఈ కుర్రవాణ్ణి పాపం వదిలెయ్యి"

"నాతోనే ఈ మాటలనడం? ఏ డెవడనుకున్నారో? మిమ్మల్ని ఈ క్షణంగా అరెస్టు చెయ్యగలను"

"అరెరె, ఎందుకంత తొందరపడతావు? నువ్వు అటువేపు చూస్తూ నుంచో ఈ అబ్బాయి ఇటు తిరిగి పారిపోతాడు అప్పుడు నీ తప్పేమీ ఉండదు"

"చాల్చాలు ఈ మాటలు నా దగ్గర చెప్పకండి ఇది రాజద్రోహం—"

"నువ్వు పందిపిల్లను ఎనిమిది పెన్నీలకు కొనడం నేను చూడలేదనుకున్నావా?"

కాన్‌స్టేబిల్ ఆట కట్టింది, నోట మాట రాలేదు, కొంతసేపటికి ధైర్యం తెచ్చుకుని "చూస్కో— నిన్నేం చేస్తానో?" అంటూ హెండన్‌ను బెదిరించాడు. కాని హెండన్ ప్రశాంతంగా ఇలా అన్నాడు

"మిత్రమా! నువ్వంటే నాకెందుకో ఇష్టంకలుగుతోంది బుద్ధిపూర్వకంగా నీకు అపకారం చెయ్యాలని నాకు దురుద్దేశ్యమేమీ లేదు నువ్వు ఆడమనిషితో అన్న ప్రతిఒక్క ముక్కా నేను విన్నాను కావలిస్తే విను," అని ఆ సంభాషణ అంతా పూసగుచ్చినట్టు అప్పజెప్పాడు. "ఏం సరిగా అప్పజెప్పానా? ఇప్పుడైనా నమ్మకం కలిగిందా? అవసరమైతే ఈ సంభాషణనే జడ్జీగారి ముందు అప్పజెప్పలేననుకుంటున్నావా?"

కాన్‌స్టేబిల్ పనైపోయింది స్తబ్ధుడై మూగపోయి నుంచున్నాడు కాని ఇంకా లొంగలేదు.

"నేను ఊరికే వేళాకోళానికన్నాను ఆమెతో. అదంతా నిజమనుకుంటున్నారేమో?"

"పందిపిల్లను దాచడంకూడా వేళాకోళమేనా?"

"ఆ, కాకమరేమిటి?"

"అయితే ఇప్పుడే వస్తా నాగు జడ్జీగారు మంచి అనుభవజ్ఞులు ఆయన్నడిగివస్తాను ఇది వేళాకోళమో నిజమో," అని రెండడుగులు నడిచాడు హెండన్

కాన్‌స్టేబిల్ సందేహించాడు, చిరచిరలాడాడు, అస్పష్టంగా తిట్టాడు, ఉమ్మేశాడు, చివరికిలాగ అరిచాడు:

"ఆగండిసార్, ఆగండి జడ్జీగారిదాకా ఎందుకులెండి ఆయనదగ్గర వేళాకోళాలు పనికిరావు చాలా కోపిష్టిమనిషి ఆయన ఇది విన్నాడంటే నా ఉద్యోగం లాగేస్తాడు. చూడుబాబూ! ఏదో పిల్లలు గలవాణ్ని. నాకూట్లో దుమ్మెందుకు పోస్తారు?— ఇంతకీ మీకేం కావాలి?"

"ఏంలేదు, చాలా చిన్న విషయం నువ్వు కాసేపు గుడ్డివాడివి, మూగవాడివి కావాలి, రెండునిమిషాలసేపు పక్షవాతం తెచ్చుకో"

"ఏమైనా నాకేవస్తుంది ముప్పు. కాస్త న్యాయంఆలోచించండిసార్. నేను ఆమనిషితో వేళాకోళానికి అన్న మాటలు పట్టుకుని ఏడిపిస్తే ఎలాగండి? మీరే ఆలోచించండి, నేను చేసింది వేళాకోళమో గాదో. ఒకవేళ తప్పే అనుకుందాం. కాని అది అంత చిన్నతప్పో చూడండి మీరు మూసీ చూడనట్లూరుకోవాలిగాని—"

"అదే నేనూ అనేది. నువ్వు ఒక్క నిమిషం మూసీ చూడనట్లూరుకో. ఆ అబ్బాయి దాటిపోతాడు"

"నాకు ప్రమాదం తెచ్చి పెట్టకండి సార్"

"ఏదెక్కువ ప్రమాదమో ఆలోచించుకో నువ్వు చేసిన నేరానికో పేరుంది, తెలుసా?"

"తస్సాదియ్యా, దానికో పేరుగూడానా? నేనే మొదటిసారిగా అలాంటి పని చేశానని గర్వపడుతున్నానే! ఏమి టది బాబూ!"

ఇంగ్లీషు న్యాయశాస్త్రంలో దాన్ని 'అన్యధనగ్రసనం' అంటారు.

"అబ్బో, గట్టి పేరే ఉందే? ఎప్పుడూ వినలేదు"

"దానికి శిక్షఏమిటో తెలుసా?"

"తెలియదు సార్, మీరే చెప్పండి"

హెండన్ చిరుదగ్గు దగ్గి గొంతు సవరించుకున్నాడు రొమ్మునిండా గాలి పీల్చాడు "జాగ్రత్తగా విను," అని గుక్కపట్టాడు "ఘోర భీకర నరకప్రాంత దురంత నిరంతర దహ్యమాన వహ్నిజ్వాలికా కీలికా మాలికా—'

"బాబోయ్, ఆపండి. వింటుంటేనే హడలుగా ఉంది. ఇంత గొప్ప శిక్ష నే ననుభవించ లేను బాబూ! రక్షించండి ఇవి చేతులు కావు, కాళ్లనుకోండి నా గొంతు కొయ్యకండి—" అంటూ కాన్‌స్టేబిల్ కాళ్లా వేళ్లా పడి ప్రాధేయపడసాగాడు

"ఆ మరిదేం మజాకా అనుకున్నావా? ఇప్పుడు దారికి వస్తావు గదూ? అటు తిరిగి నుంచో అన్నట్టు ఆ ఆడమనిషికి పందిపిల్ల నిచ్చేస్తావు గదూ? ఇంకెప్పుడూ ఇలాంటి బుద్ధి తక్కువపని చెయ్యకు."

"ఇంకెప్పుడూ చెయ్యనండి. మీరు చెప్పిన ఆ పొడుగాటి శిక్ష జ్ఞాపకమున్నంతవరకూ చెయ్యను. మీరు వెళ్లిపొండి తలుపులు బద్దలు గొట్టి మీరే ఖైదీని విడిపించుకుపోయారని చెబుతాను

# యుక్తిపరుడు

శ్రీ బాలాంత్రపు శ్యామలరావు

పూర్వము అనూరాధాపుర మందు రత్నసింహుడనే గొప్ప ధనికుడుండేవాడు అతనిఇంట చాల మంది నౌకర్లు ఉండేవారు వారందరిలోను వీరన్న పెద్ద నౌకరు. వీరన్న కాస్త మందబుద్ధి కలవాడు అయినప్పటికి సమయంవచ్చిందంటే చాల యుక్తిపరుడు. అతని భార్య పేరు వెంకమ్మ ఒకనాడు ఆమె మగనితో "ధనికుని ఇంట్లో పెద్ద నౌకరు అని పేరేగాని ఎప్పుడూ కూడుకు గుడ్డకు లోటే! పిల్లలు పాలు లేక మలమల మాడిపోతూ ఉన్నారు. యజమానినడిగి ఒక గేదినేనా తీసుకురాకూడదు" అని అనేక విధాల మొత్తుకుంది

సరేఅనిచెప్పి వీరన్న యజమాని యింటికివెళ్ళి ఒక గేదిని ఇప్పించవలసినదని కోరేడు. రత్నసింహుడయితే చాల దయకలవాడు. వెంటనే మందలోకివెళ్ళి తనకి ఇష్టం వచ్చినదానిని తోలుకొని వెళ్ళమని యజమాని చెప్పినతోడనే మన మందబుద్ధికల వీరన్న ఒక పెద్దదైన దున్నపోతుని ఏరుకొని దానిమెడకు కన్నికట్టి సంతోషముగా ఇంటికి తోలుకొని పోయినాడు.

వీరన్న తోలుకువచ్చిన దున్నపోతును చూచి వీరన్న భార్య ఇదేమిటి దున్నపోతుని తీసుకువచ్చారూ. ఇది మనకు కూడు పెట్టునా గుడ్డ పెట్టునా! ఇంతకీ మిమ్మల్ని అనవలసినపనేమున్నది. ఇలాంటి తెలివితక్కువ మగణ్ణి కట్టుకోవడం నాఖర్మం. తక్షణం పోయి మరల గేదినేనా తీసుకురండి, లేదా దీనిని అమ్మివైనా వేయండి అని చిందులు దొక్కింది.

దేముడా అంటూ వీరన్న ఏమియు చేయునదిలేక ఆ దున్నపోతుని మరల తోలుకుపోతున్నాడు. దారిలో ముగ్గురు దొంగలు ఎదురయినారు. వారు ముగ్గురు అన్నదమ్ములు. అపుడు వారు వీరన్న విచారమునకు కారణము తెలుసుకున్నారు వారిలో పెద్దవాడు ఆ దున్నపోతుని అయిదురూపాయిలకి అడిగేడు, ఇంతలో రెండవదొంగ అదేమిటి నాలుగురూపాయిలకన్న అక్కర్లేదు అన్నాడు. కాని మూడవవాడు, అదికాదు. మన తండ్రిని అడుగుదాము. అతను మనకన్న పెద్దవాడుగదా! అని సలహా చెప్పాడు. సరేఅని ఒప్పుకొని వీరన్న వారివెంట బయల్దేరాడు అక్కడికి ఒక క్రోసెడు దూరములో వారి తండ్రి ఒక గుడిసెలో నివసిస్తున్నాడు అక్కడికి వెళ్ళి విషయంఅంతా చెప్పేసరికి ముసలివాడు "దీనికి నాలుగురూపాయలకన్న" అక్కర్లేదు అన్నాడు. ఇక చేయునది ఏమియులేక వీరన్న ఆ నాలుగురూపాయిలు తీసుకొని తిరిగి వెళ్ళిపోతుండగా వారిలో పెద్దదొంగ నేనుగదా మొట్టమొదట బేరముపెట్టినది కాబట్టి నాకు ఒక రూపాయి ఇవ్వవలసియుంది అనగానే వానికి ఒకరూపాయి చేతిలో పెట్టాడు ఇంతలో రెండవవాడు మూడవవాడు కూడ అటులాగునే చెప్పగానే వారి ఇద్దరికి చెరో రూపాయి ఇచ్చివేసినాడు అయితే బేరము కుదిర్చినది నేనుకదా యని

(34-వ పేజీచూడండి)

---

జైలు తలుపులు శతాబ్దాలనాటివి లెండి అందుచేత జడ్జీగారు తేలిగ్గా నమ్మేస్తారు."

"చాల మంచివాడివి నువ్వు. మొదటే చెప్పానుగా, నువ్వంటే నా కిష్టం కలుగుతోందని. జడ్జీగారు కూడా ఈ కుర్రవాడిమీద ఎంతో జాలి చూపించారు. అతడు తప్పించుకుపోయినందుకు ఆయన సంతోషిస్తారే గాని మరేం అనుకోరు"

హెండన్ బాలరాజును వెంట బెట్టుకుని గబగబ ఆ ప్రదేశందాటిపోయాడు.

★

(ఇంకా వుంది)

# తాడితన్నేవాడిని

శ్రీ పుల్లెల వెంకటేశ్వరశర్మ [illegible]

ఏదేం ఖర్మమో కాని "అతని కంటె ఘనుడు" అనేరకం పోగయ్యాం నలుగురం. మాలో ఎవడూ ఎవడికి తీసిపోడనటంలో సందేహం లేదు. అటు చదువు చూద్దామా. యిక వేరే చెప్ప నవసరంలేదు ఓ, న, మః ల దగ్గర నుంచి కలసే వస్తున్నాం. ఆ సంవత్సరంఅందరం సెకండుఫారం పాసవుతా మనుకొన్నాంగాని అటువంటిదేమీ జరుగలేదు.

ఆయేడు దసరా పరీక్షలలోని పేపర్లు యిచ్చారేకాని మార్కుల విషయం తప్ప తక్కిన విషయాలు ప్రసంగించే వాళ్లం. ఎందుకంటే ఆ విషయం ఎత్తితే మా తెలువులు బయట పడ్తాయేమోనని భయం ఆనాడు యింట్లో బాగా కేకలువేసే సరికి యిక నేనుండబట్టలేక ఆ ప్రసంగంతెచ్చా.

"నాకు హిష్టరిలో సున్నా వచ్చిందిరా" అన్నా నేను.

"నాకు హిష్టరీ జాగ్రఫీలలో సున్నాలురా" అన్నాడు పాండు

"అరె నాకుహిష్టరీ, జాగ్రఫీ, లెక్కలలో బండి చక్రంరా" అన్నాడు రాముడు.

"అరెరె నాకు హిష్టరీ,జాగ్రఫీ, లెక్కలు, సైన్సులలో పెద్ద బండి చక్రంరా" అన్నాడు రంగాయి

ఇందులో ఎవరు ఎవరికి తీసి పోలేదుగదా అని సంతృప్తి పడ్డా.

ఒకసారినేను "నేను బడికి వస్తుం డగా యివాళ గాడిద ఎదురయిందిరా" అంటే

"నాకు గాడిదా, బోడెమ్మా ఎదురయ్యార్రా" అన్నాడు పాండు

"అరెనాకు గాడిదా, బోడెమ్మా పిల్లి ఎదురయ్యార్రా" అన్నాడు రాముడు

"అరె నాకు గాడిదా, బోడెమ్మా, పిల్లి ఒంటి బ్రహ్మణుడు ఎదురయ్యార్రా" అన్నాడురంగాయి.

ఈ మాటల్లోని తెలివి చదువులో చూపెట్టినట్లయితే రెండవ ఫారం రెండో సంవత్సరం చదివే అదృష్టం పట్టకపోను

ఏది ఏదయినా మా స్నేహం విడిపోలేక పోలే యీ సంవత్సరంలో వచ్చిన మార్పేమిటంటే "డివైన్" అనే పదాన్ని మాలో ఎవరు పట్టకొచ్చారో గాని ఆ పదాన్ని మా నలుగురితో చేర్చి, "డివైన్ ఫోర్" అనే నామకరణం చేసుకొన్నాం మా జట్టుకు అది మాటలవరకే గాని, డివైన్ అనే పదానికి అర్థం మాలోగాని మా చేతల్లోగాని ఏమీ కనుపించదనే విషయం యిప్పుడు తెలుసుకున్నా

క్లాసులో వెనుక బెంచీలు ఆక్రమించటం, గోల చేయటం, మాష్టర్లను ఏడిపించటం, సెలవు రోజుల్లో గదిలోకిదూరి, కుర్చీలు బల్లలు విరుగకొట్ట క్లాసు మధ్య దూలానికి వ్రేలాడ కట్టటం—ఇవి మా లీలల్లోకొన్ని.

ఒకసారి రంగాయిని లెక్కల మాష్టరు కొట్టితే, రంగాయికి కోపం వచ్చి, యింకా కొద్దిసేపట్లో లెక్కల మాష్టారు వస్తాడనగా బోర్డుమీద లెక్కల మాష్టరు బొమ్మ వేసి, "వీడికి బుద్ధిలేదు"అని ప్రక్కన వ్రాసి స్వస్థలంలో కూర్చొన్నాడు

లెక్కల మాష్టారువచ్చి బోర్డు మీద బొమ్మను చూచి ఉగ్రుడై "యీ బొమ్మ యిక్కడుండటానికి కారకులెవ్వరు"అని గర్జించాడు. రంగాయిగొంతు మార్చి "బహుశ మీ తల్లి దండ్రులు" అన్నాడు. అంటే ఆబొమ్మ ఆయనదేనని. క్లాసంతా గొల్లుమంది

ఇలా రోజులు గడుసుండగా మాకొకరోజు సినిమాకు పోవాలని బుద్ధిపుట్టింది అనుకొన్నా పని నెర [illegible] వాడు మాలో లేదు ఎక్కువ పట్టుదలలు చదువులోఉంటె బాగుపడిపోదుము. యింట్లో తల్లిదండ్రుల నడిగాం. కాని అందరము కలసి బేడా కాసీ సంపాదించేసరికి తలప్రాణంతోకకు వచ్చింది సినిమాకు వెళ్ళాలంటే, కనీసం నేలకువెళ్ళినా నలుగురికి రూపాయికావాలి "ఎలాగురా అంటే ఎలాగురా" అనుకొంటూ రోడ్డున పడ్డాం

ఇంతలో మా నలుగురికళ్లను రోడ్డుమీద రూపాయిబిళ్ల ఆకర్షించింది నలుగురం దానివద్దకు పరుగెత్తాం

"యిది నత్తుదిరా" అన్నా నేను.

"ఏదో ఒకటి లేవోయి అసలులేని దానికన్న నయమేలే" అన్నాడు పాండు

"దీన్ని మార్చి సినిమాకు వెళ్దాం"

అన్నాడు రాముడు

"శేషు కొట్లో" అన్నాడు రంగాయి

శేషుకు కాస్త రేచీకటని ప్రతీతి అందుకని అక్కడ మార్చటానికి నిశ్చయించుకొన్నాం కాస్త చీకటిపడ్డ తరువాత అయితే నయమని దీపం పెట్టుండగా వెళ్ళి "తాతా! రూపాయిచిల్లరివ్వ" అని రూపాయి యిచ్చాం శేషు రూపాయిని గల్లాలో వెసుకొని, కూతుర్ని పిలచి అమ్మాయ్ గూట్లో నాలుగుపావలాలుపెట్టా తెచ్చివీరికి యివ్వవే" అని దొడ్లోకివెళ్లాడు

శేషుకూతురు మాకు పావలాలిచ్చింది అవి తీసుకొని సినిమా టైమవుతుందని గబగబా వెంకటేశ్వర టాకీస్‌కి పరుగెత్తాం నేను "నాలుగు నేలటిక్కెట్లివ్వండీ" అని బుకింగులోకి చెయ్యిపెట్టా బుకింగులోని గుమాస్తా 'ఈసత్తు పావలలన్ని ఎక్కడ సంపాదించారు నాయనా" అనేసరికి మేమందరము, రూపాయి మొఖాలు వెయ్యక తప్పింది గాదు

"వేశాడురా టోపి' అన్నాడు పాండు

"సరేలెండోయి త్వరగా పదండి రత్నాటాకీస్‌లో కొత్త సినిమా బయట టిక్కెట్లమ్మే వాడికి టోకరావేద్దాం" అన్నాడు రాముడు

అనుకొన్నట్లు టిక్కెట్లు బయట కొందామనుకొంటే "ఒక్కొక్క టిక్కెట్టు పావలా అర్థనా" అన్నాడు చేసేదేముంది మాదగ్గరున్న బేడాతో రూపాయిబేడపెట్టి నాలుగు టిక్కెట్లు తీసుకొని హాల్లోకి జొరబడ్డాం

రెండోగేట్లో టిక్కెట్లు చింపే వాడు మమ్మల్ని అడ్డగించి "యివి నిన్నటి టిక్కెట్లు వెళ్ళిపొండి" అన్నాడు చేసేదేమీలేకే తిరుగు మొఖంపట్టాం

"అంతా మోసంరా" అన్నా నేను

"మోసం ఏమిట్రా పచ్చిమోసం అను" అన్నాడు పాండు

"ఇంతకీ ఎవడు బాగుపడ్డాడు లేవోయి అటుశేషా? టిక్కెట్లు అమ్మినవాడా? మనమా? పైగా మనదగ్గరుండే బేడాకూడా వదలింది" అన్నాడు రాముడు

"ఇంతకీ తాడినెక్కే వాడిని తలతన్నేవా డుంటాడు" అనుకొంటూ మిగిలిన కానీపెట్టి బటానీలు కొందామనుకొని మా మనలమ్మవద్దకు బయలుదేరాం ★



# యుక్తిపరుడు

(31-వ పేజీ తరువాయి)

ముసలివాడు అనగానే ఆ మిగిలిన రూపాయి ఒక్కటి ఆ ముసలి వానికి ఇచ్చివేసి బుర్రగోకుకొనుచు ఇంటిముఖం పట్టేడు.

ఇంటికి చేరుకొని జరిగినదంతా భార్యతో చెప్పేసరికి నానా చివాట్లుపెట్టింది అపుడు వీరన్నకి తెలివివచ్చింది జరిగినది ఏదో జరిగిపోయింది ఇపుడు నాకు ఒక మంచి ఆలోచనతట్టింది నీ నగలు, చీరలలో ఒకచీర నాకుఇయ్యి అని వీరన్న భార్యనడిగేడు.

వీరన్న చీరకట్టుకొని పమిటి కొంగు ముసుకు వేసుకున్నాడు నగలు మెడ లిరిగేటట్టు పెట్టుకున్నాడు. సరే బయల్దేరి వెళ్ళి సాధారణముగ దొంగలు కాచే రోడ్డు ప్రక్కనే కూర్చున్నాడు ఇంతలో ఇదివరకు దొంగ ఒకడు అలావచ్చాడు ఆడవేషంలోఉన్న వీరన్న నెత్తి మొత్తుకుంటూ ఏడవడం ప్రారంభించాడు ఏవండమ్మా, అలా ఏడుస్తున్నారు, అని దొంగఅడిగేడు అయ్యో ఏమి చెప్పను. నేను, నాభర్త అడవిలో ప్రయాణంచేస్తూఉండగా ఒక పెద్ద పులి నాభర్తని మింగేసింది. ఎలాగయితే నేను తప్పించుకుని ఇవతల పడ్డాను. ఇంక నాకిప్పుడు ఎవరు దిక్కు అని మరీ ఏడవడం *మొదలెట్టాడు ఏడవకు చిన్నదానా, నాకు భార్యకావాలి నన్ను పెళ్లి చేసుకో, నీకు అన్ని కోర్కెలు తీరుస్తాను ఇంటికిపోదాం పద అని ఆ దొంగ అనగానే వీరన్న వానివెంట బయల్దేరాడు. ఇంటికి వెళ్ళగానే మిగత ఇద్దరు కూడా నేనంటే నేను పెళ్ళిచేసుకుంటాను అని గుద్దులాడుకుంటున్నారు. ఇంతలో ముసలి తండ్రి 'నేను ముసలివాడిని, మీరు దొంగతనానికి వెళ్ళితే నేను ఒక్కడిని ఇల్లుకాసిపెట్టుకొని కూర్చోవాలి ఎవరేనావచ్చి నన్నుకొట్టి ఉన్నది తీసుకొనిపోతే దిక్కుమొక్కు కాబట్టి నేను పెళ్ళిచేసుకుంటాను నాకు సహాయంగా ఉంటుంది అన్నాడు ఇంతలో ఆడవేషంలోఉన్న వీరన్న ఒక్కసారిగా అరే, నాడబ్బు, బంగారపు గాజులుమూటకట్టి ఈ రోడ్డుకి మూడుమైళ్ళ దూరములోవున్న ఒక పొదలోపెట్టి మరచిపోయినాను. తక్షణముపోయి అవి ఎవరు దొంగిలించకుండా తీసుకురండి అని గద్దించాడు

అపుడు వారు ముగ్గురు తొందరగా పరుగెత్తిపోయినారు వారు కనుచూపమేర దాటగానే వీరన్న ముసుగుతీసి ఒక దుడ్డుకర్రపుచ్చుకొని ఆ ముసలివాడిని పట్టుకొని చావమోదటం ప్రారంభించేడు నాదగ్గర దున్నపోతుని నాలుగు రూపాయిలకుకొని మళ్ళీ ఏవో సెపాలు చెప్పి ఆ నాలుగురూపాయిలు కాజేస్తారా. ఇపుడు నీకు బుద్ధివస్తుంది డబ్బు ఎక్కడ దాచేవో చెప్పు లేకపోతే నిన్ను చచ్చేటట్టు కొడతాను.

గోలపెడుతూ ముసలివాడు వారు ఇన్నాళ్ళనుంచి దొంగిలించిన డబ్బు దాచినపాత్రవోటు చూపించాడు. అపుడు వీరన్న ఆపాత్ర పుచ్చుకొని ఇంటికి ఒకటేదవుడు తీశాడు.

కొంతసేపటికి వెర్రిముఖాలు వేసుకొని ముగ్గురు దొంగలు తిరిగి వచ్చి వారి తండ్రిప్రమాదస్థితిని చూశారు. మీరు చాల తెలివైన వాళ్లు మీరు ఇక్కడకు తీసుకొని వచ్చిన ఆడమనిషి ఎవరూకాదు. ఆ దున్నపోతును అమ్మినవాడే. వాడు నన్ను చావగొట్టి ఉన్న డబ్బును తీసుకుపోయినాడు. అని ఏడుస్తూ ఆ ముసలివాడు కొడుకులకి చెప్పాడు అపుడు ఆ ముగ్గురు దొంగలు వాడిని పట్టుకొని చావ కొడతామని తండ్రిగగ్గర శపథం పట్టారు కాని డబ్బుపోయినందుకు చాలవిచారించారు.

ఆ మరునాడే వీరన్న మర యోగి వేషంవేసుకొని కొన్ని మందులసీసాలపెట్టి బుజాన్ని వేసకొనివెళ్ళి ఆ దొంగల కుటీరాని సమీపంలోనే తిష్టవేశాడు అన్ని వ్యాధులకు దెబ్బలకు మందుల ఉన్నాయి అని ప్రచార



 

చెయ్యడం ప్రారంభించేడు. ఇదివిని ఆ దొంగలు వారి తండ్రి దెబ్బలు బాగుచేయమని ఆ యోగిని బ్రతిమాలేరు. యోగివేషంలోవున్న వీరన్న ఆ ముసలివాడిని చూసి అరే, ఇంతంతపెద్ద దెబ్బలు ఎవరు కొట్టినారండి చాలపెద్దవే, నే చేయకలిగినంతచేస్తాను కాని దీనికి కావలసినమందు నాదగ్గర కొద్దిగానే వుంది. మీరుపోయి ఆ రోడ్డుదగ్గర నాతాలూకు మనిషి ఒకరు ఉన్నారు వానిదగ్గరఉన్న మందను నేనిమ్మన్నానని తీసుకురండి అని చెప్పగానే వారు ముగ్గురు వెళ్ళారు. ఇంతకుముందే వీరన్న తన భార్యని ఆ రోడ్డుదగ్గరకూర్చోమని చెప్పి ఎవరేనా వచ్చినట్లయితే పారిపొమ్మన్నాడు. అలాగే ఈ ముగ్గురు దొంగలను చూడగానే వీరన్న భార్య కాళ్ళకి బుద్ధిచెప్పింది. అరే, నిన్నేమిచెయ్యాము. ఆ యోగి నీ దగ్గరమందు ఉందని చెప్పినాడు. అదిఇయ్యవలసింది అని కేకలువేసినారు. వీరికేకలు పెడచెవినిబెట్టి వీరన్న భార్య పరుగెత్తుకొనిపోయింది.

ఇంతలో వీరన్నవీలు చూసుకొని మళ్ళీ దుడ్డుకర్ర పుచ్చుకొని కొట్టడం మొదలెట్టేడు. నా దున్నపోతుని నాలుగురూపాయిలకుకొని మరలవాటిని కాజేస్తావా! ఏదీ, మిగతాడబ్బు ఎక్కడుందో చెప్పలేకపోతే చంపేస్తాను అని ఇంకా కొడుతున్నాడు ఈ దెబ్బలకి తాళలేక ముసలివాడు మిగతా డబ్బు ఉన్నచోటు చూపించేసరికి ఆ డబ్బుకూడ తీసుకొని వీరన్న పారిపోయాడు.

అన్నదమ్ములు ముగ్గురు తిరిగి వచ్చేసరికి వారితండ్రి వారి తెలివి తక్కువతనానికి విచారించి ఇక ముందెప్పుడు తనను విడచివెళ్ళ వద్దని చెప్పెను

మరికొద్దిరోజులకే వీరన్న ఆ వూరిలోనే నివసించుచున్న రావన్నదగ్గరకివెళ్ళి నీవు నాకు చిన్న ఉపకారము చేసినట్లయితే వెయ్యిరూపాయిలు బహుమానము ఇస్తానన్నాడు వెంటనే రావన్న అకస్మాత్తుగ ఒక గంపెడు డబ్బు కలిగేటువంటి సమయం చూసి చాలా ఆనందపడ్డాడు. చేయవలసిన పని ఏమని అడగగా వీరన్న వూరు చివరనున్న గుడిసె దగ్గరకు వెళ్ళి నేనే దున్నపోతుని అమ్మిన మనిషిని అని అరచి ఎవరయినను నన్ను వెంటాడిన నీ ప్రాణమును రక్షించుకొనవలెను అని చెప్పెను ఈ పని చేయుటకు రావన్న ఒప్పుకొని డబ్బును తీసుకొని ఆ గుడిసె దగ్గరకువెళ్ళి తలుపుతన్ని నేనే దున్నపోతుని అమ్మిన మనిషిని మీ చేవ కనపరచండి చూదాం అని అరచి పరుగెత్తుకొని పోయెను అంతవరకు వీరన్న మీద కారాలు, మిరియాలు నూరుతూన్న ముగ్గురు దొంగలు వానివెంట పరుగిడినారు. వెళ్ళి వెళ్ళి రావన్న ప్రక్కనున్న గ్రామములోని ఒక గుడిసెలోదూరి ఆయజమానికి పది రూపాయలిచ్చి రక్షింపబడ్డాడు మన ముగ్గురు దొంగలు వెర్రిముఖాలు వేశారు

దొంగలు లేని సమయం చూసి మన వీరన్నమరల ఈ ముసలివాని గుడిసెయందు యమునిలా ప్రత్యక్షమయినాడు. చేత కర్ర పుచ్చుకొని మిగత డబ్బు కోసం గర్జించినాడు ఇంక చేయునది ఏమియులేక ముసలివాడు "నా దగ్గర డబ్బులేదు కాని మార్గస్థుల దగ్గర దొంగలించిన నగలు ఉన్నాయి ఇవి తీసుకొని నన్ను రక్షించు బాబు అని బ్రతిమాలుకున్నాడు.

అంతట వీరన్న ఆ నగలు తీసుకొని భార్యఅయిన వెంకమ్మ దగ్గరకువెళ్ళి హాస్యముగ దున్నపోతు వల్ల సంపాదించిన ధనము వల్ల సంతృప్తిపడితివా అని యడగగా వెంకమ్మ సంతోష మునకు మేర లేకపోయెను ఈధనము పుచ్చుకొని వారిరువురు దొంగలకు దూరముగానున్న పట్టణమునకుపోయి సుఖముగా కాలక్షేపము చేసిరి మన దొంగలయిన వీరు సంపాదించిన ధనము పోయినందుకు విచారించిరి. కాని మరల వారు మామూలువృత్తిని ప్రారంభించారు.

(చూశారా 'చెల్లా యిలూ' తమ్ముళ్ళూ' వీరన్న బుద్ధిబలం వలన ఎంతడబ్బు సంపాయించాడో. అందుకనే మనపెద్దలు యుక్తికి మించిన శక్తియులేదు అంటూంటారు. తెలిసింది అన్నయ్యా మరింక కలానికి కాస్తరెస్టుఇప్పింద్దాం మరివ. ?(



# కుండపెంకులు

(14 వ పేజీ తరువాయి)

నన్ను ఎంతో ఎక్కువగా అర్థం చేసుకున్న నువ్వు ఇదంతా ఒకసారి పర్యవేక్షిస్తే నాలోని అల్లరి తెలుస్తుంది

నాకు దుర్మార్గం చేయాలని ఎన్నడూ లేదు కేవలం నీకు తృప్తికలిగే మార్గంలో నే నేనూ కొంత సంతోషా న్ననుభవిద్దామని ఉంది నిన్ను నేనెన్నడూ పాడుచెయ్యడానికి సంకల్పించుకోలేదు తప్పకుండా నిన్ను నేను పెళ్లి చేసుకోగలను ఈ సామీప్యం నువ్వు గుర్తించగలిగితే నిన్నటి శారీర సామీప్యం ఆమడలకొద్దీ దూరమని నీకు అర్థమౌతుంది నీవు దీన్ని అర్థంచేసుకోగలవని నాకు నమ్మకం కూడాను ఇంతకంటె పెద్దపెద్దవే నువ్వు అర్థంచేసుకోగలిగావు

ఇంతకూ నేను చేసింది ఏమిటి? చాలా చిన్ని పొరపాటు దీనికి ఇంత శిక్ష తగదు- నేను మీయింటికి రావడం మానుకుంటున్నా నంటున్నప్పుడు నువ్వు ఊరుకోవడం ఏమీ బాగులేదు

ఇంకొక సంగతి, నీవు తెగించగలిగిన దానివి సంఘటనను పెద్దదిగా చూసుకుని ఏ ఆత్మహత్యకో నిర్ణయించుకుంటావని నా అనుమానం కాని నువ్వే అలాచేస్తే నేను నీవెంట రావలసి ఉంటుంది లేకపోతే నేను మరొకర్ని పెళ్లి చేసుకోవలసి వస్తుంది అది అసంభవం నేను ఈ ప్రపంచంలో ఇంకొకరికి చాలను ఇంకొకరు నాకూ చాలరు ఒక్క నువ్వూ నేనూ మాత్రమే ఒకగూటి పడవలసినవాళ్లం దయచేసి నూరేళ్ల పంట పాడుచేయవద్దు నేను చేసింది తప్పే అయితే చాలా చిన్నతప్పు అయినా క్షమించు నన్ను అర్థంచేసుకున్న వెంటనే కాకిచేత కబురంపు ఉంటాను

నీ గోపాలం

ఉత్తరం రాసిన వెంటనే మరొకసారి పర్యవేక్షించి వెంటనే సైకిలు మీద వెళ్లాను వాళ్లింటకొచ్చినవాళ్లందరూ వెళ్లారు ఇది మరీ ఏడవడానికి సమయమైందే అనుకున్నాను ఏమీ మాట్లాడకుండానే ఉత్తరం ఇచ్చాను తనూ మాట్లాడకుండానే తీసుకుంది తీసుకుంటూ ఒకసారి నావంక చూసింది అదెలాంటిదో నేను చూడలేదు

* * *

మూడురోజులు గడిచాయి ఆనాడు అమ్మ స్వయంగా "వంకటేశ్వర్లుగారింటకెళదాం వొస్తావురా?" అంది నేను రానని చెప్పాను మరేమీ అనకండా తనే వెళ్లింది

ఒకగంటలో తిరిగొచ్చి "ఒరే అబ్బాయీ! ఇంకన్నీ అదృష్టపు రోజులే వొస్తాయి చూసుకోరా!" అంది

"ఏమిటే?" అన్నాను

"అనుకోకుండా అయ్యేవి అనుకుంటే అవవు చూశావుగా మరి! ఐదేళ్లబట్టి గింజుకుంటున్నామా పెద్దదానికి పెళ్లి కాలేదని! ఇవాళ అయిపోయింది!"

"అంటే? ఏదన్నా సంబంధం స్థిరపడ్డదా? అయితే యింకా వాళ్లొచ్చి దీన్ని చూడాలేదు ఏమీ లేదుగదా అప్పుడే యిలా అంటావేం?"

"చూడ్డం ఎందుకు? ఎరగరవా? మన ఘూషణానికే నురా!"

"ఆఁహాఁ!" అన్నాను సంతోషం ఎక్కువగా ఆక్రమించగా

"వాడూ నేనూ రాత్రీపగలూ గింజుకున్నాం ఐదేళ్లు! అలాంటిది గంటే ఒక్క గంటలో ఐపోయింద!-ఏమీ లేదు మాతమ్ముడు మనం ఇక్కడికొచ్చి ముందు చెప్పారా, పోనీ మీ వంకటేశ్వర్లుగారి అబ్బాయి పెళ్లాం పోయిందిగదా, ఆ పిల్లాడికి అడగకూడదా అని! అంటే నాకూ ఏదో బావుందనిపించి వొచ్చేశాం, సరి ఇన్నాళ్లూ వీలయింది కాదు - ఆయన ఊళ్లో వుండకా నేను ఇంట్లో వుండకాను!-ఇప్పుడు వెళ్లి ఆయనతో సంగతంతా చెప్పి కాళ్ళావేళ్ళా పడ్డాను ఆయనా చూశాడుగా, మనం పడ్డ కష్టాలన్నీ! ఇంతలా చెప్పాలా అమ్మా నామీద పడేయండి భారం - మావాడికెలాగూ ఈ కార్తీకంలోనే చేసేద్దామనుకుంటున్నాం గనక లక్ష్మినే చేసేస్తాం- మీరూ పాపం ఎంతకని కష్టపడతారు- అన్నారు ఇంత వేగిరం ఒప్పుకుంటాడనుకోలేదుకే-"

"ఇందుకా-ఆయన ఊళ్లో వున్నారా అని రోజూ అడిగేదానివి! హారి తస్సాదియ్యా!"

"అందుకేనాయినా,-ఇంకా ఏ నాలుగు వేలో కట్నం పోస్తేగాని ఒప్పుకోడనుకున్నారా! కట్నం మీ కెంత గావాలంటే అంత తీసుకోండి, కాస్త నా సంగతీ ఆలోచించి-అన్నాను సుక్కు మీద వేలేసుకుని అంతమాటనకండి, నేను పుచ్చుకోను అన్నాడు!"

"ఏమిటి, కట్నం అసలక్కర్లేదన్నాడూ?"

"ఆఁ అంచేత - ఒరే బాబూ! నువ్వు గభాల్ను మామయ్యదగ్గిరకెళ్లి వంటనే వాణ్ణి పిల్చుకురా! మరసలు టైము లేదు ఇవాళ చతుర్దశా, ఇంక పున్నానికి పదిహేనురోజు లుంది నేను మధ్యాన్నం వెళ్లి బేంకులో డబ్బుతెచ్చి ఎత్తాలు మొదలెడతాను - అన్నట్టు అత్తని కూడా తీసుకురావాలి ఇప్పుడు బస్సుందా?"

"ఇంత తొందరేమిటమ్మా?"

"తొందరేరా! పదిహేను రోజులే వుంది ఎలాగా బహుళ విదియనాడో తదియనాడో పెడతరు ముహూర్తం ఇప్పుడొచ్చి జాతకాలూ అవీ చూస్తామన్నారాయన నువ్వు మరి బయల్దేరాలి"

"అయితేసరే ఒంటిగంటకి బస్సుంది అన్నంతిని వెళ్తాను"

"అలాగేకానీ - పోనీ ఇప్పుడు దీని జాతకం తీసికెళ్లి వంకటేశ్వర్లుగారి కిచ్చిరా సాయంకాలం లోపుగా నువ్వు మామయ్య దగ్గిర కెళ్లి రేపటికల్లా వాళ్లని తీసుకొస్తే, రేపు సాయింత్రంలోగా ముహూర్తం నిర్ణయమైపోతుంది"

అమ్మ గాభరా చూస్తే నాకు నవ్వొచ్చింది

* * *

"అరె! మా యింటికొచ్చేశావే! మీ శపథం ఏమైనట్టూ?" అంది శకుంతల

"మీ నాన్న ఉన్నారా యింట్లో?"

"లేరు బజారుకెళ్లేరు"

"మీ అన్నయ్యో?"

"వడూను!"

"చచ్చానే! - అయితే వొచ్చాక యీ కాయితం ఆయన కిచ్చి!"

"ఏమిటిదీ? ఓహో, లక్ష్మిజాతకమా?"

"ఎందుకో తెలుసా?"

"తెలుసు" అని నవ్వింది శకుంతల

"ఇంతకన్న మధురమైన సంగతి ఎరుగుదువా? ఇంత మధురంగా ఉండబట్టే శపథం గిపథం జాంతానై అంటూ వొచ్చాను - దీనివల్ల మన సామీప్యం ఇంకా ఎక్కువైపోయిందిగదా! మనస్సులు మరీ బీరకాయ పీచయి అల్లుకుపోయినాయి గదా!"

"ఇంక చాలూరుకోండి"

"వెళ్తాను ఫోంచేసి ఒంటిగంటకి బస్సుకి వెళ్లాలి రేపు మధ్యాన్నానికి మళ్లా వొస్తాన"

"అదేమిటి? అమ్మ క్కసపడివెళ్లండి!"

"పరవాలేదు లే"

"అదికాదిలారండి!"

వళ్లాను

"తప్పటుకుంటుంది సుమండీ! ఓసారి వెళ్లిరండి మంచినీళ్లడిగి తాగిపొండి"

తిన్నగా వెళ్లి అత్తను మంచినీళ్లే అడిగి, తాగి, "శకుంతల చేతికి లక్ష్మి జాతకం ఇచ్చాను మామయ్యొస్తే చెప్పండి నేను మళ్లా రేపు మధ్యాన్నంవరకూ కనపడను"

"అదేం?"

"ఊళ్లో వుండను మామయ్యగారిదగ్గిరికెళ్లి ఆయన్ని తీసుకురావాలి అటుపైని పెళ్లిఎత్తాలకి మరోమనిషి కావాలిగా, మా అత్తని తీసుకొస్తాను"

"మంచిది వెళ్లునాయనా"

వెళ్తూ శకుంతలతో "గుడీవనింగ్ మేడమ్!" అన్నాను సంతోషం అతిగా అలముకుంది నన్ను

శకుంతల నవ్వింది

* * *

పదిహేనురోజులవరకూ, అసలు తీరుబాటన్నది లేకపోయింది ఇక్కడికీ, అక్కడికీ, బజారుకనీ, ప్రింటింగ్ ప్రెస్సుకనీ, తెగతిరగడం అయ్యేది రోజుకూ ఏదో ఒకవేళను వెంకటేశ్వర్లు మామయ్య ఇంటికి వెళ్లడం కష్టమయ్యేది ఉద్దేశమున్నా, సైకిలున్నా, పని తొందరా నన్ను నమిలి మింగాయి ఈ పనికి ఇంత సరుకు చాలదా అని అంచనా వెయ్యడమూ, తప్పయిపోగా మళ్లా సమయంగాని సమయమప్పుడు బజారుకి పంపడమూ మా అమ్మకూ అత్తకూ పరిపాటయింది విసుక్కున్నా తప్పుతుందా అనుకుంటూ ఎలాగో చేసేవాణ్ణి నాలో ఇంత ఓపికఉందని నాకూ తెలీదు, మా అమ్మ ఆశ్చర్యపడ్డది

చివరికి అన్నీ సక్రమంగానే అయినయి పెళ్లి చాలా వైభవంగా జరపాలని మా అమ్మ ఉద్దేశం ఎందుకంటే ఎలాగా కట్నమంటూ రెండువేలు మనం వేరె వుంచాంగదా, అవి కర్చుపెట్టేద్దాం, కొత్త పేరన్నా ఉండిపోతుంది - అంది నాకూ యిది బాగానే తోచింది వెంకటేశ్వర్లు మామయ్య స్వయంగా మా వ్యవహారాలు పైన వేసుకుని పెళ్లి తన యింటో జరిగేట్టూ, ఆ వీధిలోనే ఇంకో యిల్లు విడిది అయ్యేట్టూ చూశాడు

డాబామీద ఒక మిలిటరీ కేన్వాసుతో పందిర వేశారు అది పెద్ద షెడ్డయి, ఇంటి వైశాల్యాన్ని ఇంకా ఎక్కువ చేసింది డాబా మధ్య నున్న వాకిలికి తాటాకుల పందిర వేసి కింద మంటపం కట్టారు చుట్టూవున్న గదుల్లో సామాను చిన్నా చితకా ఓ గదిలోవేసి ఇల్లంతా ఖాళీచేసి ఇచ్చారు అంతా సొంతకూతురు పెళ్లిలా శ్రద్ధ తీసుకొన్నాడు వెంకటేశ్వర్లు మామయ్య

అనుకున్నకంటే ఎక్కువ వైభవంగా జరిపించాం అందరూ చాటునా ఎదురుగా కూడా పొగుడుతున్నారు స్వయంగా నేను విన్నవిషయాలవి అంతకంటె అధికంగా చెప్పనక్కరలేదు

పెళ్లిలో శకుంతలకీ నాకూ ఉన్నకథ పైకి విజృంభించి ప్రాముఖ్యత పొందలేదు కాని దానికి లోపల్లోపల ఎంతోవిలువ పెరిగి ఇదర్లోనూ సంతోషాలు ఎక్కువైనవని చెప్పగలను పైకిఎలానూఉన్నవి, నవ్వులు - తృప్తివల్ల పుట్టినవి!

ఒకసారి విడిదిమేడమీద ఎవరైనా భోజనానికి పిలవవలసినవాళ్లుండిపోయారేమో అని వెళ్తున్నాను నేను మేడఎక్కుతూంటే శకుంతల దిగుతోంది ఛటుక్కున నన్ను చూసి ముడుకుపోయి కుడిచేతిలో వున్న పట్టుపంచ గుండెకి హత్తుకొని నవ్వుతూ- "అబ్బా! ఇప్పుడేంవొద్దు" అంది

నేను నాకులేని ఉద్దేశానికి ఆశ్చర్యపడి ఛటుక్కున తెచ్చుకుని, నవ్వి, "అబ్బా, యిత్పుడే!" అన్నాను

దొంగతనంగా మేడఎక్కిపోయి అక్కడున్న ఆడపిల్లల్లో కలిసిపోయింది నేనూ వెనకనేవెళ్లి "మీరందరూ ఇక్కడున్నారేమమ్మా? భోజనాలు పెడుతున్నారు, పదండి ఊఁ- పదండమ్మా!" అన్నాను

ఆనాడు కేవలం తృప్తీ సుఖమూ ఆశపడి ఒకపనిచేసి తృప్తీసుఖమూ రెంటిలోనేన్నీ పొందలేక పోయాను అది ఒక పెద్దగాథకు కారణమై పోయింది ఎంతోబాధపడ్డాం

కాని ఈనాడు, ఏమీ ఆశపడకండా, ఏమీ ప్రయత్నించకండా, తృప్తిని పొందాను శృంగారం గూరంగావుంటే నే ఆనంద మిస్తుందా?

* * *

యీన్నాళ్లలో ఒకనాడు వెంకటేశ్వర్లు మామయ్య, అత్త, అమ్మ, సరస్వతీ ఆఖరు పంక్తిలో భోజనంచేస్తున్నారు ఉత్సాహం ఇంకాపోలేదు రాత్రి పదదగ్గిరవుతున్నా నేనూ, శకుంతల, వాళ్లపిన్ని కూతుళ్లు, ఆచుట్టుపట్లనే ఉన్నాం నేను గుమ్మందగ్గిర కూచున్నాను శకుంతల, వాళ్లపిన్ని కూతురు ఆఖరుది, ఆలోపుని కూచున్నారు.

కొంతసేపు ఏదో గడిచాక శకుంతలపక్కనే కూచున్న ఆపిల్ల "పెదనానా! మరి శకుంతలక్క పెళ్ళెప్పుడూ?" అంది

"అవును గోపాలంకూడా ఊరికే తొందరపడిపోతున్నాడు!" అంది సరస్వతి

"గోపాలం తొందరపడితేమాత్ర మేం లాభం?" అన్నాడు మామయ్య

"ఏం, ఇంత వేగం ముహూర్తాలు కుదరవనా?" అంది సరస్వతి

"ముహూర్తాలు కుదరకేంజేస్తాయిలే! కావలిస్తే రేపొద్దున్నకి తయారుచేయించేస్తాను పెట్టుముహూర్తం ఒకటి!"

"మరి?"

అత్త అంగుకుంద "అలా అన్నామరి శకుంతలని గోపాలానికివ్వడాని కొల్లగాదు!"

"ఏం?" అంది సరస్వతి

"ఎలా వీలౌతుంది? ఒకయింట్లోనే రెండు సమ్మంధాలు చెయ్యకూడదే!"

"కుండపగలడమంటరు అదేనా?" అంది సీతమ్మ

"అదేనమ్మా"

"అయితే, గోపాలానికి శకుంతలని చెయ్యకూడదూ?" అంది సరస్వతి బెంగతో అన్నట్టు

"అబ్బే, పిల్లదే!" అన్నాడు మామయ్య

"అదేమిటినాన్నా, చిన్నప్పట్నించీ అనుకుంటున్నదిగదా!"

"అనుకుంటే ఏంపోయింది? మరొకడు దానికొస్తాడు, మరొకత్తె వాడి కొస్తుంది!"

"అలా బాగులేదండీ మామగారూ, అలాంటప్పుడు వాళ్ళనిదగ్గిరిగా తిరగనియ్యడమేనా మానుకుని ఉండవలిసింది" అన్నాడు సరస్వతిభర్త ఆంగ్లంలో

"నాకు సంగతులు తెలుసు వాళ్ళలాంటివాళ్లు కారు" అన్నాగుమామయ్యఆగ్లంలో

"మీరు చూశారా?"

"చూడకపోయినా నేనెరుగుదును అది తప్పు కాదు"

"పోనీ వాళ్ళు పవిత్రులే అనుకుందాం వాళ్ళకిమాత్రం హృదయాలనేవి ఉండవూ?"

"ఉంటే ఉంటాయి కాని ఆచారాన్ని దాటివెళ్ళలేం"

మమ్మల్నెవరూ చూ.లేదు - మర్యాద దక్కించి ఇంగ్లీషులో మాట్లాడారు గాని లేకపోతే - అనుకున్నాను మొదట తరవాత నేను నిలువునా కృంగిపోతున్నానా అనిపించింది శకుంతల తలవంచుకుంది

* * * *

"ఇంత జరిగాక కూడా నువ్వు ఇండిఫరెంట్‌గా ఉండడం నాకు బాగాలేదు" అన్నాను

"ఏంచెయ్యమంటారు లేకపోతే?" అంది శకుంతల

"ఏదోఒకటి చెయ్యాలి మనిద్దరం ఒకచోట ఉండకపోతే కష్టమని నీకు తెలీదా?"

"తెలుసు నాకూ కష్టమే"

"అయితే మరి!"

"మనం ఏమీ చెయ్యలేం"

"నువ్వు తలవొంచుకుని ఏమీ చెయ్యలేమనేస్తే యెలాగ?"

"అయితే వినండి నిన్న రాత్రల్లా బెంగెట్టుకున్నాను పొద్దున్నకి జ్వరం వచ్చింది అమ్మా నాన్నగారూ మాట్లాడుకున్నారు అమ్మ నా గురించి ఏమిటో చెప్తోంది నాన్నగారు పిల్లే దంటున్నారు అమ్మ కూడా చచ్చి చిక్కిచ్చిందని ఒప్పుకుంది"

"నేనూ మీ నాన్నని అడిగాను పిల్లేదన్నాడు"

"ఊరుకుందురూ! మన ఖర్మాని కెవడేంచేస్తాడు?"

"అదికాదు శకుంతలా, మనం ఇద్దరం ఓచోట ఉండడానికి ప్రయత్నించు ఇద్దరం కలిసి ప్రయత్నిస్తే నెగ్గిపోతాం"

"ఏం జెయ్యమంటారు?"

"చెప్తాను మరి నన్ను తిట్టకు - నీ సొంతానికున్న నగల్తోమాత్రం నాతో వొచ్చెయ్ ఎక్కడన్నా నేను ఉద్యోగం చూసుకునేవరకూ పనికొస్తాయి తరవాత నా ఉద్యోగమే మనల్ని పోషిస్తుంది"

"అమ్మ చచ్చిపోతుంది"

"చస్తే చావనీ తనకిగాకపోతే ఏదోనట నూరేళ్లు బతకవలసినవాళ్లం మన జీవితాల్ని నాశనంచేయ సంకల్పించారే, వాళ్లు చస్తేనేం? మనం ఓచోట ఉండచ్చు కొంతేనా తెగింపు ఉంటేగాని ఇలాంటివి పనిచెయ్యవు"

"ఏమిటివిమీ మాటలు? నాకర్థంకాలేదు"

"అవును అర్థంకావు ఆడవాళ్ళకే ఎక్కువ సాహసం ఉందనుకున్నాను కాని తప్పయిపోయింది ఇలా నువ్వు వెనక్కి లాగకపోతే ఈ పాటికి రైలుస్టేషనులో ఉండేవాళ్ళం"

"నేను అలా రాలేనండీ"

"లేకపోతే మరోమార్గం ఉంది చచ్చిపోవడం!"

"అది చేద్దామా?" అంది శకుంతల తెగింపుగానే

"—శకుంతలా! నువ్వెంత పిచ్చిదానివయి పోతున్నావ్! చక్కగా నూరేళ్లూ బతకమని దేముడు నీకు ఆయుష్షిస్తే, చచ్చిపోతానంటావేం? ఇక్కడా వుంది, నీ తెగింపు?"

"మరేం చేస్తాం మాకు తెగింపులేదు. మీకే వుంది?"

"చాల్లే సీరియస్‌గా చెప్పు ఇద్దరమూ చచ్చిపోతే మీ అమ్మా మా అమ్మా బెంగెట్టుకు చస్తారా, లేక యిద్దరమూ లేచిపోతే చస్తారా?"

"                    "

"మాట్లాడవేం? ఎలాగూ వాళ్లు చావరు నీలాంటి నాలాంటి యువజనుల్ని ఎంతోమందిని శారీరకంగానూ మానసికంగానూ చంపిగాని ఈ ముసిలాళ్లు చావరు - కాదంటే కాసేపు ఏడ్చి ఊరుకుంటారు ఇంక లేచిపోతేనా - మనల్నే తిడతారు ఓ నాలుగురోజులపాటు ఆనక వాళ్లే ఊరుకుంటారు"

"—కుక్కల్లా పారిపోయారు అని ఆడిపోసుకుంటారు తరతరాలాను"

"భయం లేదులే బానిసల్లా వాళ్లు నిర్ణయించిన జీవితాలనే ఉచ్చుల్లో తలదూర్చి ఉండిపోయే కన్నకుక్కల్లాగో గుర్రాల్లాగో పారిపోతే బెటరూ"

"కాదు"

"శకుంతలా! నువ్వు మొండివాదం వేస్తూ కూచుంటే నాకు కోపం రాదు, చిరాకూ .య్యదు, నువ్వు మూర్ఖురాలివైపోయినావే అని ఏడుపొస్తుంది నువ్వు ఈ మూర్ఖత్వంలోనే ఇంకా ఉండిపోయినట్టయితే ఇద్దరమూ జీవితాల్ని దుర్భరంగా గడపవలసి వస్తుంది రా! నామాట విను పోదాంపద నువ్వు నన్ను అనుమానిస్తున్నావా అనిపిస్తోంది కూడాను"

"ఏమని?"

"నేను నిన్ను తీసుకుపోయి మళ్లా ఒక్కణ్ణే ఒస్తానని కాని అలాంటిదేం చెయ్యను నువ్వు నా బెస్టుఫ్రెండు వని ఎప్పుడో చెప్పాను పద నామాట విను"

"ఊరుకోండీ"

"ఊరుకోడం కాదమ్మా నేను చాప్రాక్టికల్‌గా చెప్తున్నాను నిన్ను బతిమాలుకుంటున్నాను నువ్వు లేకపోతే బతకలేను బలవంతంగా, నిన్ను మభ్యపెట్టీ, మోసంచేసీ తీసుకుపోలేక గాదు కాని నాకూ హృదయమంటూ వుంది నువ్వొస్తే రంతోషిస్తాను రాకపోతే చావలేను కాని కుళ్ళిపోతాను"

"                    "

"రావుగదూ!"

"                    "

* *

జీవిస్తున్నాం అందరితోనూ కలిసే ★

(అయిపోయింది)

# యోగ్యుడైన డైరెక్టరు



ఈనాడు డైరెక్టర్లకు కళాగౌరవం లేదు ఎక్కువగా డబ్బువచ్చే పిక్చరు తీసినవాడు మేటి డైరెక్టరు ఏ డైరెక్టరు చేతిలో అధికంగా కళాసృష్టి జరుగుతుందన్న ప్రశ్న చిత్రనిర్మాతలకు లేనే లేదు సినిమా ప్రేక్షకులకూ అసలే ఉన్నట్టులేదు ముందుముందు సినిమాప్రేక్షక సంఘాల ప్రతినిధుల ద్వారాగాని, సినీటెక్నిషియనుల ద్వారాగాని ఈ లోపం తీరవచ్చునేమో

ప్రస్తుతానికి మటుకు డైరెక్టరంటే చిత్రనిర్మాతలకు డబ్బువచ్చే చిత్రాలు తీసిపెట్టే శక్తిసామర్థ్యాలుగలవాడన్న భావం ప్రచారంలో ఉంది సినిమా చిత్రాలకు డబ్బు బాగా రావాలంటే ప్రజలను అమితంగా ఆకర్షించాలి గనక, అటువంటి ఆకర్షణతో కూడుకున్న చిత్రాలుతీసే నేర్పరితనం ఈ డైరెక్టరు కున్నట్టే భావించాలి ఈయన కళాకారు డనుకున్నట్టయితే ప్రజలను అపారంగా ఆకర్షించేశక్తే సినిమాకళ అని అనకోవలసి వస్తుంది

ఈ నిర్వచనం తప్పని వేరేచెప్ప నవసరంలేదు శరీరానికి ఆహారం పుష్టినిచ్చి తద్వారా శక్తి చేకూరుస్తుంది మద్యం తాత్కాలికంగా ఇచ్చే ఉత్సాహోద్రేకాలు మంచి ఆహారంద్వారా ఎన్నడూ రావు అయినా మద్యం ఆహారమని ఒప్పుకోలేం మద్యం తాత్కాలికంగా ఎంత ఉద్రేక మిస్తుందో కాలక్రమాన అంత నీరసపరుస్తుంది ఇటువంటి శక్తి సినిమా చిత్రాల కున్నట్టయితే వాటిని కళ అని ఎవరూ అనరు కళ అన్నది భావచైతన్యాన్ని కలిగించి సమష్టిమీద విధిగా జాతీయ వికాసానికి తోడ్పడాలి అది వ్యక్తులను మతాలుగానూ, మతాలను సంఘాలుగానూ, సంఘాలను జాతిగానూ పదిగుచ్చాలి ఎవరి ఏకాంతంలో వారు చదివి తన్మయత్వం చెందాలంటే కళ అవసరం లేదు, బూతుకథలే చాలు

అయితే డైరెక్టరు కళాస్రష్టకుడన్న భావంకూడా అనేకమందిలో ప్రచారంలో ఉంది పిక్చరు తీయవలసిన కథను స్క్రిప్టు రచయిత రాస్తా[రు] నటులు నటిస్తారు, కేమెరామాన్ ఫొటోగ్రాఫు చేస్తాడు, ఎడిటర్ ఎడిట్ చేస్తా[డు], మధ్యలో డైరెక్టరు చేసేదేమిటని చాలా మంది అభిప్రాయం

ఇది సరిఅయిన అభిప్రాయం కాదని సులభంగానే నిరూపించవచ్చు మాట వరసకి ఒకే స్క్రిప్టును నలుగు రైదుగురు డైరెక్టుచేసి నట్లయితే అన్ని చిత్రాలూ ఒకటిగా ఉండవు స్క్రిప్టు లోని అంశాలు ప్రవేశ పెట్టక పోయినప్పటికీ ఈవ్యత్యాసం ఉండనే ఉంటుంది డైరెక్టరుకూ డైరెక్టరుకూ ఉండే ఈతేడాలు కేవలం "టేకింగు"కు సంబంధించినవి దృశ్యాన్ని ఖండాలు గా—షాట్స్ గా—విభజించటం దగ్గరనుంచి షాట్స్ వెంబడి కేమెరాను జతచేయటం వరకూ డైరెక్టరుకూ డైరెక్టరుకూ తేడా ఉంటుంది ఇందులో ఏ డైరెక్టరు ఏ ఇతర డైరెక్టర్లకన్న గొప్ప అన్న సమస్యజోలికి పోనే అవసరంలేదు నలుగురు డైరెక్టర్లూ ప్రతిభగలవారే కావచ్చు నలుగురూ దృశ్యంలో ఉన్న ప్రధాన రసాన్ని సమంగానే పోషించవచ్చు. కాని ఆ ప్రధాన రసం వెంట ఒక్కొక్కరు ఒక్కొక్క ఉపరసాన్ని సృష్టించవచ్చు, లేదా ఉన్న రసాన్నే కథకుడు గాని, నటులు గాని బలపరచ లేని విధంగా డైరెక్టరు టేకింగులో బలపరచవచ్చు అందులో కళాసృష్టి ఉన్నది

మరెవ్వరూ చేయలేనిపని మరొకటి డైరెక్టరు చేస్తాడు అదేమిటంటే "మోతాదు"లు నిర్ణయించటం. ఏపాత్ర ఏఘట్టంలో ఏరసాన్ని తీసుకురావలిసిందీ నటుడికి కూడా సులభంగా తెలియవచ్చు కాని ఎక్కడ ఎంత మోతాదులో చెయ్యాలన్నది కేవలం నటుడికి వదలటానికి వీల్లేదు ఎందుకంటే నటుడు తనకు ప్రాముఖ్యం రావటం కోసరం మోతాదు హెచ్చించవచ్చు అదీ కాక నటులు అనేకమంది ఉంటారు అందరూ వెళ్ళి కథకుణ్ణి అడిగి కథకుడి అభిప్రాయం తెలుసుకోవటమూ, అన్ని దృశ్యాలలోనూ, అన్ని షాట్లలోనూ ఎంతెంత మోతాదులో ఏ యేరసం సృష్టి చేయాలో తెలుసుకుని జ్ఞాపకం ఉంచుకోవటమూ సాధ్యమైన పనికాదు ఆపని డైరెక్టరు నిర్వహించి ఏ ఫిలింముక్కలో ఏయే సంభాషణా, నటనా, భావప్రకటనా ఉండాలో దానికితగ్గట్టు తుంపులు దేనికదిగా నిర్మించి అన్నీ అంటించేసరికి కళాఖండం తయారయేటట్టు చూస్తాడు ఏ తుంపు (షాట్) లోనూ ఒక సమగ్రభావంగాని, రసరేఖగాని లేకపోవచ్చు మొత్తంమీద సమగ్రభావాలూ రసాలూ రావాలంటే డైరెకరు రసాన్ని కూడా ఖండాలుగా చిత్రించి అతికించి జీవంపోయగలవాడై ఉండాలి. ఇది సామాన్య నటుల కందరికీ వదిలిపెట్టదగిన పనికాదు

ఈ సందర్భంలోనే గమనించదగిన కళాసృష్టి రహస్యం ఒకటుంది రసయుతమైన సంగీతం తీసుకుని అందులో అచ్చగా స్వరాలే ఉన్నాయనటం పొరపాటు అచ్చగా స్వరాలు సంగీతం సాధించలేవు స్వరాల మధ్యగల జాగాలు కూడా సంగీతానికి ప్రాణమే. చాతగానివాడు ఆ జాగాలను సరిగా పాటించక, స్వరాలను సరిగా వాడి కూడా జుగుప్స కలిగించవచ్చు. చిత్రనిర్మాణంలో కూడా ఇటువంటిదే ఉన్నది. చిత్రంలో వినిపించేవి సంభాషణలు, పాటలు, బాక్‌గ్రౌండ్ మ్యూజిక్. ఇవి కాక ఇంకొకటి కూడా వినిపిస్తుంది—నిశ్శబ్దం మాటలకూ, పాటలకూ, సంగీతానికీ ఎంత రసస్ఫురణాశక్తి ఉందో, నిశ్శబ్దానికీ అంత ఉంది—ఇంకా ఎక్కువే ఉంటుంది కూడానూ తెరమీది పాత్రల వాగ్వాదంగాని, సంఘర్షణగాని ఒక స్థాయికివచ్చి మొండిబడిన జాగాలో చిత్రం కొంతసేపు నిశ్శబ్దంగా నడిచినట్టయితే "సస్పెన్స్" పుడుతుంది అట్లాగే ఒక సంభాషణ అనంతరం మరొక సంభాషణ ప్రారంభించకముందు ఎంత జాగా నిశ్శబ్దంగా ఉంచాలో సరిగా తూచినట్టయితే మొదటి సంభాషణ యొక్క

ప్రాముఖ్యం బాగా పెరుగుతుంది. అట్లాగే ఒక పాత్ర ఒకమాట అన్న తరవాత, దాని ఫలితంగా ఇంకో పాత్రగాని ఆ పాత్రేగాని ఏదైనా చైతన్యం ప్రదర్శించాలంటే మధ్య ఎంత ఖాళీ ఇవ్వాలో సరిగా నిర్ణయించాలి. ఇటువంటి సమస్యలన్నిటినీ కలిపి స్థూలంగా "టైమింగ్" అనవచ్చు. ఒకే షాట్‌లో నటుడు "టైమింగ్" పొరపాటు చేస్తేగాని రెండు షాట్ల మధ్య ఎడిటర్ పొరపాటు చేస్తేగాని అది సరిచేయవలసిన భారం డైరెక్టరుది.

డైరెక్టరు చేతిలో ఉన్న "మోతాదు" "టైమింగ్" నిర్ణయాలు రెండూ రసోత్పత్తికి ప్రాణంలాటివి. స్టేజినాటకాలుకూడా వీటి ఆధారంతోనే రక్తి కడతాయి. అందుచేత వాటికి కూడా సరిఅయిన డైరెక్టరంటూ న్యాయంగా ఉండాలి. అయితే స్టేజిమీద నడిచే నాటకంలో ఈ అంశాలు రిహార్సల్సులో భద్రపడతాయి. నాటక ప్రదర్శనంలో డైరెక్టరు స్వయంగా జోక్యం కలిగించుకో లేదు కనక డైరెక్టరు నిర్ణయాను అమలుచేసే భారం పూర్తిగా నటులపై ఉంటుంది. సినిమాలో అట్లా కాదు. నాటక ప్రదర్శనలో జరిగిన తప్పులు మరొక ప్రదర్శనంలో సరిచేయవలసిందే. సినిమాలో తప్పులు జరగటానికే వీలులేదు. ప్రతిషాటూ సరిగా వస్తేనే మరొక షాటుకు పోవటం.

డైరెక్టర చేతిలో ఉండే ఈ శిల్పం సద్వినియోగమవుతుందా దుర్వినియోగమవుతుందా అన్నది డైరెక్టరు కళాభిమానంపై ఆధారపడుతుంది. డైరెక్టర్ హిచ్‌కాక్‌ను "మాస్టర్ ఆఫ్ సస్పెన్స్" అంటారు. కథలో ఉన్న "సస్పెన్స్" కన్న పదిరెట్లు టెకినిక్‌తో తీసుకురాగలడు హిచ్‌కాక్. ఈ విషయంలో అయన ఔచిత్యాన్ని కూడా దాటి చాలా దూరం వెళ్లి ప్రేక్షకుల నరాలను అవసరమైన పని కల్పిస్తాడు. ఇది నిజమైన కళాకారుడి లక్షణం కాదు. హిచ్‌కాక్ ఆరాధించేది బజారుకు పనికివచ్చే శిల్పం.

కళాభిమానం గల డైరెక్టరు తన శిల్పాన్ని అభ్యుదయ భావాలను ప్రేక్షకులపై ప్రసారం చేయడానికే ఉపయోగిస్తాడు. జీవితం తాలూకు సరిఅయిన విలువలు ప్రేక్షకులకు అందజేస్తాడు. మానవ జీవితంలో ఉన్న క్రౌర్యమూ దైన్యమూ కుట్రా కుస్సూ ఔదార్యమూ ప్రేమా ఆగ్రహమూ సున్నిత ఆవేశగా ముద్రైనవి సినిమా కథగుడు పాత్రల సంభాషణల ద్వారానూ, చేతల ద్వారానూ ... యోగ్యతగల డైరెక్టరు వాటిని తన శిల్పం ద్వారా ఎంతో మెరుగు పెట్టి అందించగలడు. అటువంటి అవకాశాన్ని వినియోగ పరచుకొని సినిమా ప్రేక్షకుల అభిరుచి విలువలను మారగొన్నవాడే సరిఅయిన డైరెక్టరు ★



ప్రకాష్ ప్రొడక్షన్సు వారి 'నీడ'లో ...గోపాల్

# సినిమా వార్తలు

## "గాంధీ జీవితం"

గేబ్రియల్ పాస్కల్ "గాంధీ జీవితం" చిత్రంగా తీయబోతున్నాడు. బెర్నార్డ్‌షా నాటకాలు చిత్రాలుతీసి ప్రసిద్ధి కెక్కిన గేబ్రియల్ పాస్కల్ ఇప్పుడు హాలీవుడ్‌లో ఆర్ కే జి రేడియో సంస్థతో చేరి పనిచేస్తున్నాడు.

1952 ఆఖరుకు "గాంధీ జీవితం విడుదల అవుతుంది. ఈ చిత్రాన్ని ఇండియాలో తయారుచెయడానికి గల అవకాశాలను పరిశీలించేందుకుగాను పాస్కల్ 1950 లో ఇండియాకు వచ్చి 8 మాసాలపాటు ఇక్కడ తిరిగాడు. ఒక మాసం క్రితం గిజా హెర్జెగ్ అనే సినిమా రచయిత ఇండియాకు వచ్చాడు. ఈయన ఇక్కడ చిత్రనిర్మాణ ఏర్పాట్లుచేసి ట్రీట్మెంట్ తయారు చేస్తాడు.

ఈ చిత్రంతీసే ఉద్దేశ్యంతో పాస్కల్ ఏగాదికిందటనే తన ఆలోచనను భారత ప్రధాని నెహ్రూకూ గాంధీజీ కుమారుడైన దేవదాసు గాంధీకి తదితరులకూ తెలియజేశాడు. విన్సెంట్ షియాన్ రచించిన 'లీడ్ కైండ్లీ లైట్' అన్న పుస్తకం హక్కులను ప్రపంచ సినిమాహక్కులు కొనేశాడు. కాని చిత్రానికి స్క్రిప్టు రాసుకునేటప్పుడు మరొక విషయం స్పష్టమయిందట. అదేమిటంటే 'ఆత్మకథ', 'దక్షిణాఫ్రికా సత్యాగ్రహము" అనే గాంధీ రచనల సహాయం లేకుండా ఈ చిత్రం తయారు కాదని! ఆ కారణంచేత నవజీవన ట్రస్టువారివద్దనుండి పాస్కల్ ప్రతినిధి ఈపుస్తకాల హక్కులుకూడా కొన్నాడు. గాంధీరచన లన్నిటి హక్కులూ గాంధీ నిర్యాణానంతరం నవజీవన ట్రస్టుకు సంక్రమించాయి.

ఈచిత్రం మీద వచ్చే లాభాలలో కొంతభాగం నవజీవన ట్రస్టుకు పోతుంది. కొంతభాగం గాంధీస్మారక నిధికికూడా ఇవ్వబడుతుంది.

చిత్ర నిర్మాణానికి కావలిసిన ఏర్పాట్లు సాగించడానికి గాను బొంబాయిలో కార్యాలయం ఏర్పడుతుంది. చిత్ర నిర్మాణంలో కొందరు భారతీయుల సహాయంకూడా తీసుకోబడుతుంది. 1952 వేసవి లోగా చిత్రం షూటింగు ప్రారంభమవుతుంది. ఇండియాలో ఆరు మాసాలపాటూ దక్షిణాఫ్రికాలో రెండు మాసాలపాటూ షూటింగు జరుగుతుందని భావిస్తున్నారు.

"ఇతర దేశాలకన్న అమెరికాకు గాంధీ చిత్రం ఎక్కువగా అవసరం. అక్కడ ఆయుధ నిర్మాణపోటీ జోరుగా ఉన్నది. ప్రస్తుత అంతర్జాతీయ పరిస్థితినిబట్టి కూడా గాంధీచిత్రం అత్యవసరం. గాంధీజీ సందేశం ఒక జాతికీ దేశానికీ చెందినది కాదు. మానవజాతి కంతకూ చెందినది. ఈ సందేశం భారతీయులకు కన్న అమెరికనులకు ముఖ్యమైనది. అందుచేతనే ఈ చిత్రంకొరకు అమెరికా ఆత్రంగా వేచిఉన్నది" అని గేబ్రియల్ పాస్కల్ ప్రతినిధి భారతీయ పత్రికా విలేఖరులతో అన్నాడు.

ఈచిత్రంలో ఎవరు పాత్రధారణ చేసేదీ ఇంకా ఖచ్చితంగా నిర్ణయం కాలేదు. కాని నెహ్రూ పాత్ర చార్ల్స్ బోయర్ ధరించ వచ్చునని తెలుస్తున్నది. సీనేరియో రాయటానికి ప్రసిద్ధనాటక సినిమా రచయిత విలియమ్ సారోయాన్ నియోగించబడ్డాడు.

ఈ చిత్రాన్ని గేబ్రియల్ పాస్కల్ తీస్తున్నందుకు సంతోషించాలి. సామాన్యంగా చిత్రనిర్మాతలు వ్యాపారదృష్టికి ప్రాముఖ్యం ఇచ్చి విషయంపట్ల బాధ్యతారహితంగా ప్రవర్తిస్తారు. పాస్కల్ ఈ విషయంలో జార్జి బెర్నార్డుషాను తృప్తిపరచిన ఏకైక ప్రొడ్యూసరు. అదీగాక జార్జి బెర్నార్డుషా గాంధీని ఆరాధించినవారిలో ఒకడు. పాస్కల్ షాను ఆరాధించినవాడు. అందుచేత పాస్కల్ చేతిలో పడిన గాంధీ జీవితం చాలా ఉదాత్తంగా తయారయే అవకాశం ఉంది.

## "స్త్రీ సాహసం"

వినోదావారి "స్త్రీ సాహసం" ఆగసు 9 నుంచీ 25 కేంద్రాలలో విడుదల కానున్నట్టు తెలుస్తున్నది.

## "పాతాళ భైరవి"

విడుదల అయిన అనేక కేంద్రాలలో అతి వైభవంగా శతదినోత్సవాలు జరిపించుకున్న విజయావారి 'పాతాళ భైరవి,' కొన్ని కేంద్రాలలో రజతోత్సవాలు (25 వ వారం) జరుపుకోవటం రూఢి అని తెలుస్తున్నది.

## మాయల మారి

ఈ యేడు విజయవంతంగా నడిచిన చిత్రాల జాబితాలో అశ్వనీవారి "మాయల మారి' కూడా స్థానం సంపాదించుకుంటుంది. దీని వెనుకగా విడుదల అవుతుందనుకున్న 'స్త్రీ సాహసం" ఇది నడుస్తుండగానే విడుదల చేయవలసి వచ్చింది.



వినోదావారి "స్త్రీ సాహసం"లో అంజలీదేవి

## వాహినీవారి "మల్లీశ్వరి"

'మల్లీశ్వరి షూటింగు పూర్తి అయిపోయింది. దీనిలో అనేక ప్రత్యేకాకర్షణలున్నాయి. భానుమతి, ఎన్ టి రామారావులు మొదలుగాగల తారాగణం, శేఖర్ నిర్మించిన సెట్టింగులూ, రాజేశ్వరరావు సంగీతమూ, కృష్ణశాస్త్రి మాటలూ, పాటలూ, బి ఎన్ రెడ్డి దర్శకత్వమూగల ఈ చిత్రంకోసం సినిమాప్రేక్షకులు ఆశతో ఎదురు చూడటంలో ఆశ్చర్యం ఉండదు.

★

# కొత్తపూవు

(9-వ పేజీ తరువాయి)

వుందో కన్నీళ్ళు కాలవలుకట్టుతున్నాయి మేకుబందీచేసినట్టు కదలక మెదలక అలాగే కుంచుని వుంది

'నూటంతా విప్పేసి చిన్న దోవతికని బీరువాలో వదకుతున్నాడు ఏమిటో చిందరవందరగా పార వేస్తున్నాడు గుడ్డలన్నీ

'కావాలనుకున్నప్పుడు ఎందుకు దొరకుతుందీ ఎక్కడ పెడతారో, బ్రహ్మదేవుడికే తెలియాలి' అన్నాడు చిరాకుగా ఇది గమనించి

'స్నానంచేయటానికి తుండుగుడ్డలు నీళ్ల గదిలోనే వున్నాయి' అన్నది శాంత

'ఆ సంగతి తెలుసు ధోవతి కావాలి'

'అది బీరువాలో లేదు'

'మరెక్కడ తగలబడ్డది ఒక్కటీ సరియైన ప్రదేశంలో వుండదుగదా రానురాను బద్ధకం ఎక్కువయిపోతున్నది రాణీగారికి'

'అడిగితే యిస్తానుగా'

'అడగందే యివ్వకూడదా'

'నాకెలా తెలుస్తుంది మీకేం కావాలో'

'తెలిసిన రోజుల్లో తెలిసింది ఇప్పుడెందుకు తెలుస్తుంది' అంటూ యిచ్చిన ధోవతి తీసుకుని క్రిందికి వెళ్లాడు శాంత కూడ అతనివంటనే క్రిందకు దిగింది

నీళ్ళగదిలో కెళ్లిన మూర్తి వుగ్రుడై బయటికొచ్చాడు

'ఏరా వేడినీళ్లు లేవేం'

'అమ్మగారి నడిగితే ఏమీ మాట్లాడలేదు అందువల్ల రోజూమాదిరి చన్నీళ్లే పోసుకుంటా రనుకున్నాను బాబూ' అన్నాడు వినయంగా జవాను

'అమ్మగారెందుకు మాట్లాడుతుందీ— కాసిని వేడినీళ్లు కాచివుంచితే ఏం కొంప మునిగిపోతుంది' అంటూ విసురుగా నీళ్ల గదిలోకి తిరిగిపోయాడు చన్నీళ్లే స్నానం చేస్తున్నాడు

శాంత తలవంచుకుని పీటవేసి కంచం పెట్టింది మూర్తి స్నానం ముగించుకుని వచ్చాడు వుదికిన ధోవతి కట్టుకుని వచ్చి కంచం ముందు కూర్చున్నాడు శాంత తలుపు కానుకుని నిలుచున్నది

'ఏమయ్యా, ఈ రోజు భోజనంలోకి ఏమి చేశావ్' అని వంటమనిషి నడిగాడు

'పొట్లకాయ ' మాట యింకా పూర్తికానే లేదు మధ్యలో అందుకుని

'తగలెయ్యి, ఎన్నిసార్లు చెప్పాను, నీకా పొట్లకాయ వద్దని' అన్నాడు తీవ్రంగా

'అమ్మగారు చెయ్యమన్నది చేశాను బాబూ'

'నీకమ్మగారి మాటా, నా మాటా'

శాంత యిక భరించలేకపోయింది నిలుచున్నదల్లా గబుక్కున తిరిగి గబగబా గదిలోకి పోయింది ఏడుపు కట్టలు తెగి ప్రవాహంలా ముంచుకొచ్చింది రెండు చేతులతో ముఖాన్ని కప్పుకుని దిండులో తల దాచుకుని ఏడవటం మొదలెట్టింది

ఎంత ఓదార్చుకున్నా ఆగటం లేదు దిండంతా తడిసిపోయింది అలా ఎంతసేపుందో!-భోజనంచేసి మూర్తి ఆ గదిలోకి వచ్చాడు ఆమెను చూసీ చూడనట్లుగా వక్కపొడి తీసుకుని వెళ్లిపోయాడు

వంటమనిషి వచ్చి 'అమ్మా భోజనానికి వస్తారా' అని అడిగాడు

'లేదు నీవు భోజనంచేసి తలుపులన్నీ వేసేసి పడుకో' అన్నది తలెత్తకుండానే

'మరి మీరో?'

'నాకాకలిగా లేదులే' అనగానే వంటమనిషి,

'ఏమిటో విచిత్రమయిన మనుష్యులు' అనుకుంటూ వెళ్లిపోయాడు

శాంతకు మనసు మనసులో లేదు ఆలోచనలన్నీ అశ్రుధారలై ప్రక్కనంతా తడిచేస్తున్నాయి అలాగే పడుకుంది చిట్టి ప్రక్కన లేనిదే నిద్రపట్టేది కాదు ఈ రోజు చిట్టి మాట కూడ తలపుకు రాలేదు - నాయనమ్మ దగ్గర పడుకుని నిద్రపోతున్నాడు—

ఎనిమిదేండ్ల క్రిందట తనకు యిరువది యేండ్లున్నప్పుడు శాంతకు మూర్తితో వివాహమయింది వైవాహిక జీవితంలో వగవవలసిన అవసరం ఎప్పుడూ రాలేదు కాని ఆరు నెలలనుంచి మొదలుపెట్టింది మూర్తికీ శాంతకూ మధ్య కానరాని కలహం

దానికి కారణం శాంతకూ తెలుసు— కాని ఛీ - దానిని మనసులోనికి రానివ్వకూడదు తన స్త్రీత్వానికి అవమానం

అగ్నిసాక్షిగా, ఆర్షసాంప్రదాయానుసారం వివాహం చేసుకున్నాడు తనను ఎనిమిదేళ్ల తరువాత యిప్పుడు - ఆలోచించకూడదు భవిష్యద్వర్తమానాలు రెండూ కంటిలో కత్తుల్లా భయంకరంగా వున్నయి

కిటికీదగ్గరకు వెళ్లి నిలుచున్నది కిటికీ గుండా ప్రసరించే చల్లని వెన్నెలలు వుపశమనంగా తోచినయి దూరాన ఎక్కడో హరికథ చెపుతున్నారు నిద్రాణమైయున్న ఆ పట్టణంలో గాలిని కదిలించేది ఆ హరిదాసు గీతాలేనన్నట్లు, ఎవరికి వారు మాదగ్గిరే ఈహరికథ జరుగుతున్నదనుకునేటంత స్పష్టంగా వినిపిస్తున్నది అది వింటూ నిలుచున్నది శాంత మధ్యమధ్య కుక్కల అరుపులు మాత్రం వినిపిస్తున్నయి ఎవరికోసమలా కొట్లాడుకుంటయో ఆ కుక్కలు- స్వంత సొమ్ము పోయినంత పట్టుదలతో పోట్లాడుకుంటాయి - ధూమ్యాకాశాలు దద్దరిల్లేటట్లు మొరుగుతయి

చంద్రుడి ఆకాశయానంలో అప్పుడప్పుడు మేఘా లడ్డంవచ్చి నిడుపాటి నీడలు యిండ్లమీద పడి తాత్కాలికతమస్సులు కలుగజేస్తున్నయి

ఉన్నట్టుండి పెద్ద గోలగా వినిపించింది సినిమాహాలు దగ్గర - రెండో ఆట సినిమా వదిలేశారు ఆటలో ముచ్చట్లు చెప్పుకుంటూ గుంపులు గుంపులుగా యిండ్లకు చేరుకుంటున్నారు

శాంతకు నిద్రపోవాలన్న గమనమే లేదు నిద్రపోదామని కూడ అనిపించలేదు మనస్సేమని ఆజ్ఞాపించిందో కాని కళ్లుమాత్రం మూతలు పడకుండా యామినీదేవి యౌవన విలాసాలను సంపూర్ణంగా, సావధానంగా తిలకించేస్తున్నయి

హరిదాసు గొంతు యింకా వినపడుతూనే వున్నది తాలూకాకచేరీలో రెండు గంటలు కొట్టారు ఇంకొక మూడుగంటల్లో తెల్లవారుతుంది

నిశ్శబ్దమంతా బ్రద్దలయేటట్లు 'పట్టుకోండి, పట్టుకోండి' అన్న కేకలు వినిపించినయ్ ఎక్కడో దొంగలు పడివుంటారు దొంగతనం చేయటం దేనికి? వాళ్లకు కావలసినది ధనం - వాళ్లకది లభించేటందుకే ఈ ప్రయత్నం ధనవంతులు కావటానికివన్నీ దొంకమార్గాలు - పాపం ధనంలేక వాళ్ళు తపించిపోతుంటే-తనో ధనంవల్లనే ఏమో తనకీ ప్రస్తుతగురవస్థ అప్రయత్నంగా చిరునవ్వు నవ్వింది మందమలయానిలమా పువ్వును మోసుకొనిపోయి ఏ పువ్వులోనో దాచేసి వుంటుంది—

తాలూకాకచ్చేరీలో నాలుగు గంటలు కొట్టారు - ఇంకొక గంటలో తెల్లవారుతుంది మరొక రోజు - నరకయాతన - వస్తు ఎప్పటికీ తెల్లవారకూడదు తనకు కూడ సుమతిలాంటి శక్తి వుంటే—

తెల్లవారకుండా వుండేటట్లు నిద్రపోవాలి - నిద్రపోయినంతసేపూ రాత్రే - గబగబా వెళ్లి పక్కమీద పడుకున్నది - కాని నిద్రాదేవత శాంతకు విడాకులిచ్చింది

కోడి కూసింది తెల్లవారనే తెల్లవారింది ఇక గత్యంతర మేముంది? తెల్లవారినట్లుగానే ప్రవర్తించాలి

11 గంటలకల్లా మూర్తి భోజనంచేసి ఆఫీ

సుకెళ్లాడు శాంత అప్పటిదాకా చిట్టితోనే గడిపింది రాత్రంతా దగ్గర లేకపోవటాన చిట్టిని చూసి కొన్ని నెలలయినట్లుగా వుంది ఆమె ప్రాణానికి చిట్టికి అన్నం పెట్టేసి, తను తిని హాల్లో కుర్రవాణ్ణి ఆడిస్తూ కూర్చున్నది

'నాన్నా, పెద్దయినతర్వాత నువ్వేంపని చేస్తావురా'

'మనింటికి వస్తాడే రాజువేషం వేసుకుని ఆ అబ్బాయి పని చేస్తానే'

'పగటి భాగవతులవుతావా—ఛా అదేమిటి'

'కాదే - ఆ అబ్బాయి దగ్గర కత్తి వుంటుంది కిరీటం పెటుకుంటాడు - నాకూడా ఒక కిరీటం కావాలే'

'చేసిస్తాలే' అని అంటూంటే ఎవరో బయటినుంచి 'శాంతమ్మా' అని పిలిచారు

'ఎవరు, రండి లోపలికి' అని డ్రాయింగురూములోకి వచ్చి కూర్చున్నది

వచ్చిన స్త్రీకి దాదాపు 35 ఏళ్లుంటయి నుదుట బొట్టు వున్నది మెడలో ఒక సన్నని ఒంటిపేట గొలుసున్నది చాల సామాన్యమయిన చీరె కట్టుకున్నది వచ్చి సోఫామీద కూర్చున్నది

'నన్నెప్పుడూ చూడలేదు కాబోలు ప్రస్తుత మీ యింట్లో నీ వాక్రమిస్తున్న స్థానం ఒకప్పుడు నాది' అన్నది చిరునవ్వుతో -

'మీరు మూర్తిగారి మొదటిభార్య అన్నమాట' అన్నది శాంత ఏమీ మార్పులేని ముఖంతో

'సత్యమైన మాట సంగతంతా తెలుసుకుని రెండు ముక్కలు చెప్పిపోదామని వచ్చాను'

'ఏమిటా సంగతి' అన్నది శాంత ముభావంగా

'ఎందుకమ్మా అలా అడుగుతావ్ భార్యవైయుండి భర్తప్రవర్తనలో ఎలాంటి మార్పు వచ్చిందో, ఎందువల్ల వచ్చిందో, ఎలా వచ్చిందో గమనించకుండానే, తెలియకుండానే వున్నావంటే ఎలా నమ్మను' అన్నది నవ్వుతూ

'మార్పే లేనిది గమనించట మెలా జరుగుతుంది'

'బహుశా నీ భర్తను ఏమయినా అంటానేమో నని నీవు సత్యాన్ని కూడ ముసుగు పడుస్తున్నావు నేనూ ఒకప్పు డిలాగే అనుకునేదాన్ని గొంతుకదాకా వచ్చేవరకూ తెలుసుకోలేకపోయాను నాకూ భర్తను గౌరవించట మంటే ఏమిటో తెలుసునమ్మా'

'మిమ్మల నేమీ అగౌరవం చేయాలని అనలేదు. కాని మీరు మా సంసారం విషయంలో అపోహపడ్డారని మాత్రం అన్నాను'

'పోనీ అమ్మా చిన్నదానివయినా ఎన్నదగిన సంసారస్త్రీవి నే చెప్పె రెండు మాటలూ హెచ్చరికగా తీసుకుని నీకాపురం నిలబడేటట్లు చూసుకో'

'నా కాపురం నిలబడే వున్నది దాన్ని నిలబెట్టుకోటాని కెవరి హెచ్చరికలూ అక్కరలేదు' అన్నది కొంచెం కోపంగా

'నీకంత కోపంగావుంటే ఏమీ చెప్పను కాని చేతులు కాలకముందే తగు జాగ్రత్త తీసుకో' అని చెప్పి ఆవిడ లేచింది వెళ్లటానికి

'నా చేతు లెన్నటికీ కాలవు' అంటూ క్షణంకూడ ఆగకుండా పరుగెత్తుకుంటూ లోపలికి వెళ్ళిపోయింది

'నా చేతులు కాలకూడదు' 'నా చేతులు కాలకూడదు' అని ఆజ్ఞాపించుకుంటోంది తనను కాని - కాలుతున్నయి ఆరు నెలల నుంచి కాలి బొబ్బ లెక్కుతున్నయి

దహించుకుపోతున్నది దేహమంతా - హృదయంలో రేగిన జ్వాలలు కళ్ళలో నిప్పులు చెరుగుతున్నయి

టెలిఫోను తీసింది ఆఫీసుకు ఫోను చేసింది

మూర్తిగా రాఫీసుకు రానేలే దారోజు

టెలిఫోను క్రింద పెట్టేసి, అలాగే బయటకు వచ్చింది కనపడిన రిక్షాలో ఎక్కి కామేశ్వరరావుగా రింటికి వెళ్లింది

కామేశ్వరరావుగారు మూర్తి బాబాయి చాల పెద్ద మనిషి గవర్నమెంటులో చాల పలుకుబడిగల న్యాయాధికారి రిటైర్ అయి నాలుగు సంవత్సరా లయింది

ఆయన కాళ్ళదగ్గర కూర్చుని కడుపులో వున్నదంతా కథలా చెప్పేసింది ముసలాయన శాంత తల నిముగుతూ

'ఇంత పని చేస్తాడని అనకోలేదమ్మా' అన్నారు

'మామయ్యా, మీరే - ఏం చేస్తారో' అన్నది శాంత

'వెధవ - మొదటి పెళ్లాన్ని పిల్లలు లేరని త్రోసేశాడు - ఇప్పుడు నిన్నిలా వేధిస్తున్నాడు అటువంటి వెధవ పోతేపోనియ్యమ్మా' అన్నాడు విసుగ్గా

'అలా అంటే ఎట్లా మామయ్యా' అని బావురుమన్నది శాంత

'ఎలా వీడిని దారికి తీసుకురావడం' అన్నది కరుణార్ద్రంగా కామేశ్వరరావు గారి యిల్లాలు

'దొంగను దొంగతనం చెస్తున్నప్పుడే పట్టుకోవాలి ఈరోజు సాయంత్రం బీచికి వెళదాం - నీవుకూడ వస్తావా అమ్మా' అన్నాడు శాంతతో

ముగ్గురూ ఆరుగంటల కల్లా సముద్రపు ఒడ్డుకు చేరుకున్నారు ఒళ్ళంతా కళ్లుగా కలయవెదికింది - లక్షల జనంలో యిద్దరున్న చోటల్లా పరీక్షించింది చివరికి దొరికారు కావలసిన దొంగలు - దొంగలు కాదు దొరలే కాకపోతే ఇంతబహిరంగంగానా—

'నేను చూడలేను మామయ్యా వెళ్ళిపోతాను'

'వెఱ్ఱిపిల్లా' అని వృద్ధదంపతు లిద్దరూ ఆ ప్రణయజీవులదరికి వెళ్లారు వెనకనే తప్పుకున్నది శాంత

ఇంటికొచ్చేసింది పరుగులు తీస్తూ పైకి వెళ్లింది నిలువుటద్దం ముందు నిలుచున్నది తన శరీరంలో ప్రతిభాగాన్ని పరిశీలించింది

ఎఱ్ఱని దొండపండులాంటి పెదవులు - కాటుక దిద్దిన కలువల్లాంటి కళ్ళు - పొడుగాటి నాసికమీద రవ్వలబేసరి మెఱిసిపోతోంది - నునుపైన బుగ్గలమీద దీపాల వెలుగు ప్రతిఫలిస్తోంది విశాలమయిన ఫాలభాగంమీద సిందూరం రాజ్యంచేస్తోంది బిగువైన స్తనాలు - ఏండ్లు పైబడుతున్నా యౌవ్వనం మిసమిసలాడుతూనే వుంది - వేణీబంధం విప్పి విరియబోసింది వీపుమీద నిడుపాటి కేశాలు పిఱుదుల నంటుతున్నయి

అలంకారంలో లోపమేముంది - అతడాశించేది, తనదగ్గర లభించనిది ఏమున్నది -

'జాగ్రత్త నేను పేదరాలిని కాదు' అప్రయత్నంగా బయటికొచ్చేసింది

'మంచిది, ముందు ముందు నీకు బాగా వుపయోగిస్తుంది' అన్నది ఒక అహంకారపూరిత స్వరం వనక్కు తిరిగింది మూర్తి అప్పుడే పూచిన సన్నజాజి పూవును కోస్తున్నాడు

'చూడు, ఈ క్రొత్తపూవు ఎలా పరిమళిస్తున్నదో' పెద్దగా నవ్వాడు ఆ నవ్వులో వేయి నరకాలు వలసినయి శాంతకు

ఎముకలు విరిగి, కండలు కరిగి శరీరమంతా శోకపుతిత్తై కుప్పన కూలిపోయింది

ప్రక్క వసారాలో చిట్టిని దగ్గర పెట్టుకుని కూర్చున్నది నాయనమ్మ

చిట్టి మైదానంలోకి వేలు చూపిస్తూ,

'ఏమిటి నాయనమ్మా, ఆ మైదానంలో'

'కుక్క ఎముకలు కొఱుకుతున్నది'



# డైరీ

(4-వ పేజీ తరువాయి)

అరికట్టి, ఇండియాపై ఎన్నటికీ దురాక్రమణచేయమని పాకిస్థాన్‌ప్రభుత్వం హామీ ఇవ్వవలసి ఉంటుందని భారత ప్రధాని నెహ్రూ లియాకత్ అలీ లేఖకు సమాధానమిచ్చారు

## బుధవారం, జూలై 25 :

—ప్లానింగ్ సంఘంవారి పంచవర్ష ప్రణాళిక సఫలం కావాలంటే కొంతైనా విదేశ సహాయం అవసరమని భారత ఖజానా మంత్రి చింతామణి దేశముఖ్ చెప్పారు

—బ్రిటిష్ లేబర్‌పార్టీ కార్యవర్గం పార్టీ వార్షికసమావేశంలో ప్రవేశపెట్టేందుకు గాను పార్టీ విధానాన్ని నిర్వచించే ముసాయిదా నొకదాన్ని ఆమోదించింది

—కేసాంగ్ "శాంతి" సమావేశంలో కమ్యూనిస్టు ప్రతినిధులు - కొరియానుండి విదేశ సైన్యాల ఉపసంహరణ విషయమై ఒక క్రొత్త ప్రతిపాదన చేశారు ఈ ప్రతిపాదన సబబుగా ఉన్నందున ఆలోచించుకునే వ్యవధి ఇమ్మని సమితిప్రతినిధు లడిగారు

—సంప్రదింపులు పునః ప్రారంభించాలని పర్షియా చేసిన సూచనను విశదీకరించవలసిందని బ్రిటిష్ ప్రభుత్వం పర్షియన్ ప్రభుత్వాన్ని కోరింది

—స్పెయిన్‌తో అమెరికా మిలిటరీ సంబంధాలు పెట్టుకోవడంవల్ల పశ్చిమ ప్రజాస్వామ్యాల కూటమికి రాజకీయ నష్టాలు సంభవిస్తాయని బ్రిటిష్ విదేశాంగ మంత్రి హెర్బర్ట్ మోరిసన్ విమర్శించారు

—చైనా, ఉత్తర కొరియాలకు కీలక పదార్థాలు తాము ఎగుమతి చేస్తున్నారనే ఆరోపణను ఖండిస్తూ భారత ప్రభుత్వం సమితి కార్యదర్శి ట్రిగ్వేలికి వ్రాసింది

## గురువారం, జూలై 26

—ధన పరిస్థితి అనుమతించినంతవరకూ పరిశ్రమలను గరిష్ఠ పరిమాణానికి అభివృద్ధి చేయడమే తమ ఆశయమని ప్లానింగ్ సంఘ సభ్యుడు జి ఎల్ మెహతా అన్నారు

—ప్రజాపార్టీ సంచాలకత్వానికి ఇతోధికంగా కాలం వినియోగించగలందులకై కేంద్ర తంతి, తపాలాశాఖ మంత్రి కిద్వాయ్ మళ్లీ రాజీనామా దాఖలు చేయవచ్చునని తెలుస్తున్నది.

—"కొరియాలో యుద్ధవిరమణవల్ల కొంతకాలంపాటు శాంతి ఏర్పడినా, పశ్చిమ రాజ్యాలు ప్రమత్తత వహించరాదని అమెరికన్ విదేశాంగ మంత్రి అచిసన్ హెచ్చరించారు

—"కొరియానుండి విదేశసైన్యాల ఉపసంహరణ" అనే షరతు చేర్చబడని యుద్ధ విరమణ చర్చల ఎజెండాను కేసాంగ్ సమావేశపు కొరియన్ ప్రతినిధులు అంగీకరించారు

—అస్సాంలోని సరిహద్దు జిల్లా యైన గోవల్పారాకు చెందిన మూడు భారతీయ గ్రామాలను పాకిస్తాన్ సేనలు ఆక్రమించుకున్నట్లు యు పి ఐ వార్త

—సరిహద్దులనుండి సైనిక ఉపసంహరణ మొదలైన అయిదు అంశాలను భారత ప్రభుత్వం అంగీకరించినట్లయితే తాను పండిట్ నెహ్రూతో కరాచీలో చర్చలు జరపడానికి సిద్ధంగా ఉన్నానని పాక్ ప్రధాని లియాకత్ అలీ న్యూఢిల్లీకి లేఖ వ్రాశారు

—పాకిస్థాన్ పౌరరక్షణకు గాను ప్రత్యేకాధికారాలు స్వీకరిస్తూ పాకిస్తాన్ ప్రభుత్వం ఒక ఆర్డినెన్సు జారీ చేసింది

—భారత రైల్వే శాఖకు, అ భా రై. కా ఫెడరేషనుకూ రైల్వే సమ్మెవిషయమై తిరిగి చర్చలు జరుగుతాయా లేదా అన్నది జయప్రకాశ్ లేఖకు ప్రధాని నెహ్రూ యిచ్చే జవాబుపై ఆధారపడి వుంటుందని ఫెడరేషన్ కార్యదర్శి గురుస్వామి చెప్పారు

—పాకిస్థాన్‌లోని బ్రిటిష్ సైనికోద్యోగులు కాశ్మీర్ సమస్యలో కలగజేసుకొంటున్నారనే ఆరోపణ నిరాధారమని బ్రిటిష్ ప్రధాని అట్లీ అన్నారు

## శుక్రవారం, జూలై 27 :

—పౌరరక్షణకు గాను భారత ప్రభుత్వం ఒక స్కీము తయారుచేస్తున్నట్లు తెలిసింది

—వివాద గ్రస్తం కాని భారత భూభాగాన్ని దేన్నీ పాకిస్థాన్ సేనలు ఆక్రమించలేదని అధికార రీత్యా తెలిసింది

—కరాచీరాష్ట్ర ముస్లిం లీగ్ అధ్వర్యాన "రక్షణగణ" కార్యక్రమం జరుపబడింది పశ్చిమ పంజాబ్‌లోని సియాల్కోట్‌లో బ్లాకౌట్ చేయబడింది

—ఇండియాకు అమెరికా ధాన్య సహాయం చేయకుండా పాకిస్థాన్ చాలా ప్రయత్నించిందని భారత ఆహార మంత్రి మున్షీ ఆరోపించారు

—పెట్రోలు తగాదా విషయమై పర్షియా ప్రభుత్వం చేసిన ప్రతిపాదనలను గూర్చి బ్రిటిష్ ప్రభుత్వంతో చర్చించేందుకు పర్షియాలోని బ్రిటిష్ రాయబారి సర్ ఫ్రాన్సిస్ షెపర్డు, ఎవరెల్ హారిమన్ లండన్ వెళ్లారు

—కొరియాలో నిస్సైనిక ప్రాంతపు ఏర్పాటునుగూర్చిన సమితి రాజ్యాల పథకం కమ్యూనిస్టు "శాంతి" ప్రతినిధులకు అందజేయబడింది

—భారత కమ్యూనిస్టుపార్టీ తెలంగాణా లోని దౌర్జన్య చర్యలకు, అవి ఎవరివల్ల జరుగుతున్నవైనా, విముఖంగా ఉన్నదని పార్టీ నాయకుడు ఎ కె గోపాలన్ అన్నారు

—ఆంధ్ర, తమిళ, కేరళ, కర్నాటక ప్రదేశ్ కాంగ్రెస్ సంఘాధ్యక్షులు సమావేశమై మద్రాసు రాష్ట్రంలో ఎన్నికల ప్రచార కార్యక్రమంకోసం ఒక కమిటీని ఏర్పరిచారు

## శనివారం, జూలై 28 :

—రేషన్‌లో ప్రస్తుతం ఇచ్చే 8 ఔన్సుల బియ్యంలో 2 ఔన్సులు ఆగస్టు 12 నుండి తగ్గించుతున్నారు

—అ భ రైల్వే కార్మిక ఫెడరేషన్ తలపెట్టిన రైల్వే సమ్మెను ప్రతిఘటించడానికి భారత జాతీయ ట్రేడ్ యూనియన్ కాంగ్రెసు నిశ్చయించింది

—కొరియాలో నిస్సైనిక ప్రాంతపు ఏర్పాటును గూర్చి కేసాంగ్ "శాంతి" సమావేశంలో మళ్లీ భేదాభిప్రాయాలు వచ్చాయి

—పర్షియన్ పెట్రోలు తగాదా విషయమై బ్రిటిష్ మంత్రి వర్గం చర్చలు జరిపింది హారిమన్ కూడా ఇందులో పాల్గొన్నారు

—అబడాన్‌లోని ఆంగ్లో ఇరానియన్ ఆయిల్ కంపెనీవారి పెట్రోలు రిఫైనరీ వచ్చేమంగళవారంనుండి పూర్తిగా మూసి వేయబడుతుంది

—రష్యా ప్రపంచ మంతటా యుద్ధ ప్రయత్నాలు చేస్తున్నదని, అమెరికా ఏ అవాంతరానికైనా సిద్ధంగా ఉండాలని అధ్యక్షుడు ట్రూమన్ హెచ్చరించారు



# కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో

(7-వ పేజీ తరువాయి)

"డిబ్రే అంటే మాకు చిరకాలపు మిత్రుడండి అతను ఆంతరంగిక శాఖామంత్రికి కార్యదర్శి నా భార్య ఫ్రాన్సు దేశపు ప్రసిద్ధవంశాలలో ఒక వంశానికి చెందినది ఆమె తండ్రి ఇంటిపేరు సర్వేరా గతించిన ఆమె మొదటిపేరు కల్నల్ మార్క్విస్ నార్గన్"

"మీ భార్య పరిచయ భాగ్యం నాకింకా లభించలేదు కాని డిబ్రే కొద్ది పరిచయముంది"

"ఎక్కడ?"

"కౌంట్ మార్సెర్ఫ్ ఇంటిలో"

ఇంతలో పరిచారకుడు వచ్చి రావచ్చునని చెప్పాడు.

## 47

ఇద్దరూ కలిసి లోనికి వెళ్లేసరికి డాంగ్లర్ భార్య పియానో వాయిస్తున్నది లూషియన్ డిబ్రే సమీపంలో ఒక మేజా వద్ద నిలబడి రేఖాచిత్రసంచయం పరిశీలిస్తున్నాడు నిన్న విందు ముగిసిన తర్వాత డిబ్రే ముందుగా ఇక్కడికే వచ్చి డాంగ్లర్ భార్యకి మాంట్ క్రిస్టోనిగురించిన సమాచారాన్ని అద్భుతంగా వర్ణించి చెప్పి ఉన్నాడు డిబ్రే సామాన్యంగా ఎవరినీ అధికంగా ప్రశంసించడు అతనే ఇంత విశేషించి ప్రశంసిస్తున్నాడంటే, మాంట్ క్రిస్టో అసాధారణవ్యక్తి అయియుండాలని హెర్మినా డాంగ్లర్ భావించింది

డాంగ్లర్ హడావిడిగా వచ్చి భార్యతో ఇలా అన్నాడు "హెర్మినా! ఈయన కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో ఈయన భాగ్యసందలకి మితిలేదు మన రాజధానిలో ఒక సంవత్సరం ఉంటారట ఈ ఒక్కయేడాదిలోనూ అరవైలక్షల ఫ్రాంకులు ఖర్చుపెడతారంటే ఏమిటో ఆలోచించు పారిస్ సమాజంలో తుపాను రేచ్చగొడతారన్న మాటే!"

ఇంత మొరటుగా పరిచయ పరచనప్పటికీ, హెర్మినా మాంట్ క్రిస్టో వంక ఆశ్చర్యచకితురాలై చూసింది ఇంత ధనం వెచ్చించడానికి పారిస్ నగరాన్నే అతను ఎంచినందువల్ల ఆమెకు కుతూహలం కలిగింది "మీరు పారిస్‌కి ఎప్పుడు వచ్చారు?" అని అడిగింది

"నిన్న ఉదయం వచ్చానండి"

"కాని మా నగరంలో వేసవికాలం బొత్తిగా బాగుండదండి మాకీ కాలంలో గుర్రపుపందాలు మినహా వినోదా లేవీ ఉండవు మీకు గుర్రాలంటే సరదా ఉందా?"

"నేను చాలకాలం తూర్పుదేశాలలో గడిపానండి అక్కడ ప్రజలు రెండంటే రెండు ముఖ్యవిషయాలపట్ల శ్రద్ధ వహిస్తారు గుర్రాల పెంపకం ఒకటి, వనితల సౌందర్యం ఒకటి"

"అబ్బా" అంది హెర్మినా "ముందు వనితలమాట చెప్పి తరవాత గుర్రాలమాట చెప్తే చక్కగా ఉండేది"

"నాకు మాటల్లోనూ, చేతల్లోనూ ఉచితానుచితాలు బోధపరిచేగురువుని ఏర్పరుచుకోడం అవసరంలెండి" అన్నాడు మాంట్ క్రిస్టో"

సరిగ్గా ఈ సమయంలో పరిచారిక ఒకామె వచ్చి హెర్మినా చెవిలో యేదో రహస్యంగా చెప్పింది హెర్మినా ముఖం కోపంతో ఎర్రబడింది భర్తవంక తిరిగి రూక్షస్వరంతో "ఇది నిజమేనా" అని అడిగింది

"ఏది?" అన్నాడు కళవళపడిన డాంగ్లర్.

"నేను బొజారుడి కొన్న గుర్రాలు రెండూ సాలలో లేవటగా! దీనర్థమేమిటో చెప్పండి!"

"నేను చెప్పేది విను హెర్మినా"

"వింటున్నాను చెప్పండి ఇక్కడున్న ఈ పెద్దమనుష్యులిద్దరూ మన మధ్య ఈ తగవు తీరుస్తారు ముందు సంగతేమిటో వీరికి నన్ను చెప్పనివ్వండి సంగతి ఇదండి మా గుర్రాలసాలలో నావి ప్రత్యేకంగా రెండు గుర్రాలున్నాయి పారిస్ నగరం అంతా వెతికినా ఇటువంటి చక్కని గుర్రాలు దొరకవు రేపు ఈ గుర్రాల్ని నా బగ్గీకి కట్టి పంపుతానని హిలాయిస్ విల్ ఫర్గ్‌కి (విల్‌ఫర్ట్ భార్యకి) మాటిచ్చాను ఈపూట కోచివాడు సాలలోకి వెళ్లి చూచేసరికి ఆ గుర్రాలు మాయమైనాయి ఏవో కొద్దివేల ఫ్రాంకుల లాభంకోసం లోభంతో నాభర్త వాటిని అమ్మేసి ఉంటారని నాకు తెలుసు సందేహము లేదు"

"హెర్మినా నామాట వినిపించుకో ఆ గుర్రాలు నెమ్మదైనవి కావు వాటకింకా నాలుగేళ్లైనా నిండలేదు అవి నాకు ఏ ప్రమాదం తెచ్చిపెడతాయోనని ఇన్నాళ్లూ బెంగతో గడిపాను" అన్నాడు డాంగ్లర్

హెర్మినా భుజాలెగురవేసి, కళ్లు కుంచించి భర్తను అవమానిస్తున్నట్లు ఒకసారి పరికించింది భర్త ఇది గమనించనట్లు నటిస్తూ, మాంట్ క్రిస్టో వంక తిరిగి ఇలా అన్నాడు: "కౌంట్! మీరు పారిస్‌లో నివాసం ఏర్పరచుకుంటున్నారని ముందే తెలిసిందికాదు తెలిస్తే ఆ గుర్రాల్ని మీకిచ్చేవాడిని ఏదో ధరకి, నష్టానికైనా సరే అవి యువకులవద్ద ఉండవలసినవే కాని, ఏళ్లు పైబడిన నాబోటి వ్యక్తి దగ్గిరుండవలసినవి కావు"

"నాపట్ల మీరు చూపుతున్న స్నేహభావానికి కృతజ్ఞుణ్ణి ఇవాళ ఉదయమే ఒక జోడుగుర్రాల్ని కొన్నాను అవిగో, అక్కడ నా బగ్గీకి కట్టఉన్నాయి చూడు డిబ్రే నీకు గుర్రాల్ని గురించి చక్కగా తెలుసుననుకుంటాను నీ అభిప్రాయం చెప్పు"

డిబ్రే కిటికీవద్దకు వెళ్లాడు డాంగ్లర్ భార్యను సమీపించి మెల్లిగా ఇలా అన్నాడు "ఇతరు లున్నందువల్ల ముందు నీతో చెప్పలేదు హెర్మినా ఆ గుర్రాల్ని అమ్మేశానంటే పదహారు వేలు లాభం వచ్చింది, నువ్వు కోపగించనక్కర్లేదులే లాభంలో నాలుగువేలు నీకూ, రెండువేలు యూజనికీ (డాంగ్లర్ కుమార్తెకి) ఇస్తాను ఏమంటావ్? గుర్రాల్ని అమ్మడం మంచిదికాదూ?"

"అరె! అదేమిటి? అటు చూడండి!" అన్నాడు డిబ్రే బిగ్గరగా "నేను పొరపడ్డం లేదుకదా! మీ గుర్రాలే అవి"

"ఏమిటి నా గుర్రాలా?" అంటూ హెర్మినా గబగబ కిటికీ వద్దకు వచ్చి చూసింది "అవే నావి" అంది కోపంతో

"ఎంత చిత్రం!" అన్నాడు మాంట్ క్రిస్టో ఆశ్చర్యం నటిస్తూ హెర్మినా డిబ్రే చెవిలో గుసగుసలాడింది డిబ్రే మాంట్ క్రిస్టోని సమీపించి మెల్లిగా అడిగాడు "ఈ గుర్రాలకి ఎంత ధర ఇచ్చారో చెప్పమంటోంది డాంగ్లర్ భార్య"

"నాకు సరిగ్గా తెలియదు" అన్నాడు మాంట్ క్రిస్టో "నా గుమాస్తా కొన్నాడు కొన్నట్లే నాకు తెలియదు ఇటువంటి చక్కని గుర్రాలంటే నాకెంత ఇష్టమో అతనికి తెలుసును నగరమంతా గాలించి వీటిని కొని తీసుకొచ్చాడు ముప్పైవేల ఫ్రాంకులిక కాబోలు కొన్నట్లు నాకు చెప్పాడని గుర్తు"

డిబ్రే ఈ సమాచారాన్ని డాంగ్లర్ భార్యకి అందించాడు.

డాంగ్లర్‌కి తల కొట్టివేసినట్లయింది మాంట్ క్రిస్టో జాలిగా అతనివంక చూశాడు "చూడండి ఆడవాళ్లకు కృతజ్ఞత తెలియదు పాపం ఆమెకి ముప్పు కలుగుతుందని భయపడి మీరు వాటిని అమ్మివేస్తే, ఆ మాట ఆమె గ్రహించరు"

డాంగ్లర్ జవాబివ్వలేగు ఇప్పుడు రానున్న తుపాను గురించి ఆలోచిస్తున్నాడు హెర్మినా కోపాన్ని కయ్యాన్నీ చూసే కోరిక లేక డిబ్రే ఏదో అప్పుడే జ్ఞప్తికివచ్చినట్లు మిషపెట్టి వెళ్ళిపోయాడు తను సాధించిన కార్యాన్ని పూర్తిగా కొనసాగనివ్వాలనే ఉద్దేశంతో భార్యాభర్తల్ని కయ్యానికి విడిచిపెట్టి మాంట్ క్రిస్టో సెలవు తీసుకుని వెళ్లిపోయాడు మాంట్ క్రిస్టో బగ్గీ ఎక్కికూచుని "బలే!" అని గొణుక్కున్నాడు "అంతా అనుకున్నట్లు సాగిపోతోంది ఇప్పుడు భార్యాభర్తలిద్దరి స్నేహమూ సంపాదించడానికి—అవును బాగుంది కాని ఈ గొడవలో అతను కూతుర్ని పరిచయపరచనేలేదు"

మాంట్ క్రిస్టో ఇంటికి చేరిన రెంగుగంటల్లో గుర్రాల్ని డాంగ్లర్ ఇంటికి పంపి అతని భార్యకు ఉత్తరం వ్రాశాడు వాటిని తన బహుమతిగా స్వీకరించవలసిందిగా భార్యాభర్తలిద్దరినీ ప్రార్థిస్తూన్నట్లు వ్రాశాడు భార్యాభర్తల మధ్య కలహానికి తను కారకుడైనందుకు క్షమించవలసిందని డాంగ్లర్‌ని ప్రార్థించాడు

ఆ సాయంకాలం మాంట్ క్రిస్టో ఆట్వెల్ గృహానికి వెళ్లాడు మరునాడు మధ్యాహ్నం మూడుగంటలకి అలీని పిలిచాడు "అలీ! ఉచ్చు విసరడంలో నీకు మంచి నేర్పుంది కాదూ?"

అలీ గర్వంతో అవునన్నట్లు తలూపాడు

"అయితే రోషం పట్టలేక పరుగుతీసే రెండు గుర్రాల్ని నీ ఉచ్చు వేసి ఆపగలవా?"

చేతనౌన్నట్లు అలీ చిరునవ్వుతో తలూపాడు

"అయితే ఇటు విను నిన్న నా గుర్రాల్ని నువ్వు చూశావుగా? ఆ గుర్రాలు కాస్సేపటిలో ఈ దారిని వస్తాయి బగ్గీ బోల్తా కొట్టకుండా వాటిని సరిగ్గా నా గుమ్మంముందర నువ్వు ఆపుచెయ్యాలి అవి అదుపులేకుండా పరుగుతీస్తాయి సుమా!"

అలీ గుమ్మందిగి వీధిలోకి వెళ్లాడు దారిలో అడ్డంగా గీత గీసి వేలితో చూపాడు మాంట్ క్రిస్టో 'శబాష్' అని అలీ వీపు తట్టాడు అలీ సరిగ్గా ఆ సమీపంలో ఒక రాతిమీద కూర్చుని చుట్ట ముట్టించాడు మాంట్ క్రిస్టో లోపలికి వెళ్లి ఒక కిటికీవద్ద తెరలవెనక కనిపెడుతూ నిలబడ్డాడు

కొంతసేపటికి దూరంలో బగ్గీవస్తున్న చప్పుడు అస్పష్టంగా వినపడింది చప్పుడు వినపడిన రెండు క్షణాలలోనే వీధిలో బగ్గీ ఒకటి కనపడింది పిచ్చెక్కిన రెండు గుర్రాలు రోషంతో బగ్గీని ఈడ్చుకుపోతున్నాయి కోచ్‌వాన్ కళ్లెం ఎంత బిగబట్టినా గుర్రాలు స్వాధీనం కావడంలేదు ప్రాణాలు బిగబట్టుకుని కోచ్‌వాన్ బగ్గీ కడ్డీని పట్టుకుని కూర్చున్నాడు బగ్గీలోపల తరుణ వయస్సులో ఉన్న ఒక యువతి ఆరేడేళ్ల కొడుకు ఒకరినొకరు వాటేసుకుని ప్రాణాలపై తీపితో ఆర్తనాదాలు చేస్తున్నారు బగ్గీ ఎగిరెగిరి పడుతోంది చక్రాలు విరిగిపోతాయనిపిస్తోంది ఏ పెద్దరాయైనా అడ్డుతగిలితే బగ్గీ ఇంక తిరగపడక తప్పదు

తరుణం వచ్చిందని అలీ గమనించాడు దాపునున్న గుర్రానికి ముంగుకాళ్లు రెండింటినీ బంధించేలాగ సరిగ్గా ఉచ్చు విసిరాడు ఉచ్చుతాడు చివర బలిమిని పట్టుకోడంవల్ల గుర్రం వేగానికి కొన్ని గజాలదూరంరోడ్డుపైన అలీ దొర్లిపోయాడు కాని తాడు విడవలేదు అక్కడతో ఉచ్చు బిగిసి గుర్రం ఆగిపోయింది బగ్గీని కట్టిఉన్నట్లే ముందుకాళ్లు వొంగి గుర్రం ముందుకి పడిపోయింది మధ్యకర్రవిరిగి రెండోగుర్రం కాళ్లకి అడ్డుపడ్డంతో అది కూడా నిలిచిపోవలసివచ్చింది అదను చూసి కోచ్‌వాన్ బగ్గీలోనుంచి కిందికి దూకేశాడు అలీ ఈలోగా లేచి వెళ్లి రెండో గుర్రంముట్టె పట్టుకుని బలమైన తనవేళ్లతో గట్టిగా నొక్కాడు ఆ గుర్రం పెనగులాడి లాభంలేక బాధ భరించలేక పక్కనే పడిపోయింది మాంట్ క్రిస్టో ఇంటిలోనుంచి పరుగు పరుగున వచ్చి ఒగ్గీ తలుపు తెరిచి లోనున్న తల్లికొడుకుల్ని చేయందించి దింపాడు అప్పటికి కొడుకు స్పృహతప్పి తల్లికౌగిటిలో ఉన్నాడు తల్లి గజగజలాడుతూ నిలవలేకుండా ఉంది మెల్లిగా ఆమెను మాంట్ క్రిస్టో ఇంటిలోకి నడిపించుకు వెళ్లాడు

ఇంటిలో ఇద్దరినీ ఒక సోఫాలో చేర్చి "ఇంక భయపడకండి ప్రమాదం కొద్దిలో తప్పిపోయింది మీ కుమారునికి భయంవల్ల స్పృహతప్పింది కాని దెబ్బ ఎక్కడా తగల్లేదు ఇప్పుడే తిరిగి స్పృహవస్తుంది" అన్నాడు

"నన్నూరుకోబెట్టడానికి మీరంటున్నారు నిజంగా నా కొడుక్కి భయంలేదా? నా కొడుకు కోలుకోడానికి నాభాగ్యమంతా వెచ్చించడానికైనా సరే వసుదియ్యను దయుంచి వెంటనే వైద్యుడికి కబురు పంపండి

మాంట్ క్రిస్టో చిరునవ్వుతో ఫరవాలేదన్నట్లు చేయూపి సమీపంలోఉన్న పెద్ద పెట్టె ఒకటి తెరిచాడు దానినిండా ఔషధాల సీసాలు రంగురంగుల ఔషధాలతో నిండిఉన్నాయి ఒక చిన్నసీసా తీసి ఎర్రనిమందు ఒక్కచుక్క పెదవిపైన వేసే సరికి కొడుకు కన్నులు తెరిచాడు క్రమంగా కొంతసేపటికి కొడుకు తేరుకున్నాడు తల్లికికూడా భయం పోయింది

కొంతసేపైనతరవాత "ఈయిలైవరిది?" అని ఆమె ప్రశ్నించింది

"ఎవరిదైతే నేమి? మిమ్మల్ని రక్షించే అదృష్టం నాకు లభించింది"

"దీని కంతటికీ కారణం లేనిపోని నా సరదాయే డాంగ్లర్ భార్య అద్భుతమైన గుర్రాల్ని కొన్నదని పారిస్ నగరమంతా మోగిపోతే చూడాలని కోరిక పుట్టంది"

"అయితే ఈ గుర్రాలు బారన్ డాంగ్లర్ భార్య కొన్నదా?"

"అవునండి మీకు ఆమెతో పరిచయం ఉందా?"

"ఉందండి అంతే కాదు ఈ ప్రమాదాని కంతకీ నేనే కారకుణ్ని కూడా ఈ గుర్రాల్ని నేను నిన్న డాంగ్లర్‌వద్ద కొన్నాను కాని ఆయన భార్యకి ఈ గుర్రాల్ని విడిచిపెట్టడం ఇష్టంలేకపోయింది అందువల్ల వీటి నామెకు బహూకరించాను"

"అయితే మీరేనా కౌంట్ ఆఫ్ మాంట్ క్రిస్టో? మిమ్మల్ని గురించేనా హెర్మినా అంతగా చెప్పింది?"

"నేనేనండి"

"నా పేరు హీలాయిస్ విల్‌ఫర్ట్ నా భర్త న్యాయాధికారి మీ రీనాగు మాకు చేసిన ఉపకారానికి మే మందరం ఆజన్మాంతం కృతజ్ఞులమై ఉండాలి మీ నౌకరువచ్చి సమయానికి రక్షించకపోతే నేనూ నా కొడుకూ ఈపాటికి ఏమైపోయేవాళ్లమో తెలియదు మీ నౌకరుకి నేను బహుమతిఇస్తే మీరు అన్యథా భావించరుకదా?"

"మరీ అధికంగా ప్రశంసించడం కాని, బహుమతు లివ్వడం కాని నౌకర్లకి మంచిది కాదండి వాడు నా బానిస మీ ప్రాణాలు కాపాడ్డం టే నా ఆజ్ఞ నిర్వర్తించాడంతే"

హీలాయిస్ విల్‌ఫర్ట్ ఇంకేమీ చెప్పలేగు ఈ వింత వ్యక్తిని

ఆశ్చర్యంతో పరిశీలించింది మాంట్ క్రిస్టో ఆమె కొడుకుని శ్రద్ధతో పరిశీలిస్తున్నాడు ఎడ్వర్డ్ కి వయస్సుకి తగిన పుష్టిలేదు ముఖం పాలిపోయి ఉంది చూపుల్లో కొంటెతనం, మంకుతనం ఉట్టిపడుతున్నాయి వయస్సుకి మించిన తెలివి కనపడుతుంది తల్లి చేతుల లోనుంచి పెనగులాడి బయటపడి, పెట్టె వద్దకు చేరి ఔషధాల సీసాల మూతలు తీసివెయ్యడం మొదలు పెట్టాడు

"ఆ! ఆ! అవేవీ ముట్టుకోకు" అన్నాడు మాంట్ క్రిస్టో అందులో కొన్ని ద్రావకాలు ప్రమాదమైనవున్నాయి కొన్ని ముట్టుకోనక్కరలేదు వాసన చూస్తేనే ప్రమాదం"

హెలాయీ విల్ ఫర్ట్ తెల్లబోయింది కొడుకును గభాల్న అందుకుంది అయితే అదిమొదలు ఆమె దృష్టి ఔషధాల పెట్టె పైనే ఉండిపోయింది మాంట్ క్రిస్టో ఇది గమనించాడు తరవాత ఎడ్వర్డ్ తల్లివద్ద చేరి ఆలీని చేతితో చూపుతూ "అమ్మా! అంత అసహ్యంగా ఉన్నాడేమిటి? వాణ్ణి పొమ్మను" అన్నాడు

మాంట్ క్రిస్టో లోలోపల తృప్తిచెందాడు తన కోర్కెలు నెరవేర్చుకోడానికి మరొక సాధన దొరికిందనుకున్నాడు

"మీ నివాసం ఇదేనా?" అని అడిగింది హెలాయీ విల్ ఫర్ట్.

"కాదండి ఈ యింటిని ఈ మధ్యనే కొన్నాను నేను ౦ంప్ ఎలిషీలో 30వ నెంబరు ఇంటిలో నివసస్తున్నాను ఇంక మీరు ఇంటికి వెడతారనుకుంటాను మీ బగ్గీ పాడైనట్లుంది నా దగ్గరున్న ఒక బగ్గీకి మీ గుర్రాల్ని కట్టించి సిద్ధంగా ఉంచాను ఆలీ స్వయంగా బగ్గీ నడుపుతాడు మీ కోచ్‌వన్ ఇక్కడే ఉంటాడు మీ బగ్గీని మరమ్మతు చేయిస్తున్నాను మరమ్మతు కాగానే మా గుర్రాలు రెండింటిని కట్టి మీ బగ్గీని రేపు డాంగ్లర్ ఇంటకి పంపుతాను"

"అమ్మో! మళ్ళీ ఆ గుర్రాలనే కడతారా? వొద్దు"

"ఫరవాలేదండి, ఆలీ చేతుల్లో అవి సాధువులై పోతాయి. మీరే చూస్తారు కదా!"

ఆలీ కొత్తబగ్గీకి గుర్రాల్ని కట్టి, గుర్రాల ముఖాలకు, ముక్కులకు మందొకటి పులిమాడు అంతతో గుర్రాలకు పిచ్చి కోపం ఇట్టే తగ్గిపోయింది బగ్గీ మెల్లిగా సాగిపోయింది

ఆ రోజునే గుర్రాలను డాంగ్లర్ ఇంటికి తిప్పి పంపుతూ హెలాయీ విల్ ఫర్ట్ హెర్మినా డాంగ్లర్ కి జరిగిన సమాచారాన్ని గురించి పెద్దఉత్తరం వ్రాసింది గుర్రాల్ని వెంటనే మార్చవలసిందనీ, లేకపోతే ప్రాణాలకు ముప్పు కలుగుతుందనీ హెచ్చరిస్తూ, మాంట్ క్రిస్టోతో పరిచయభాగ్యం లభించినందుకు ఆనందం వలిబుచ్చింది తరవాత డాంగ్లర్ ఇంటిలో తిరిగి మాంట్ క్రిస్టోని తను కలుసుకునే ఏర్పాటు చెయ్యవలసిందని డాంగ్లర్ భార్యని ప్రార్థిస్తూ, తాను తన భర్తను మాంట్ క్రిస్టో దర్శనానికి పంపుతున్నట్లు కూడా తెలియపరిచింది

ఆ రోజున ఆట్వీల్ సంఘటనగురించి పారిస్ సమాజంలో విశేషంగా ప్రచారమయింది ఆల్బర్ట్ తన తల్లితో చెప్పాడు డిబ్రె మంత్రులకు నివేదించాడు బోశాంప్ తన పత్రికలో ఈ ఉదంతాన్ని ప్రచురించాడు విల్ ఫర్ట్ మాంట్ క్రిస్టోదర్శనానికి స్వయంగా బయలుదేరాడు 

# నీరుగట్టుపురుగు

(17-వ పేజీ చూడండి)

అని శేరున్నర జొన్నగింజలు కొలిచి ఒక గుడ్డలో కట్టియిచ్చినాడు

"నీ మేలెన్నటికీ మరిచిపోనన్నా" అని మెల్లిగా యింటిత్రోవపట్టినాడు గంగులు

మరుసటిరోజున్నే గంగులు యింట్లో వాళ్లంతా యేడుస్తున్నారు గంగులు చనిపోవడాన్ని గురించి ఆవాడలోని పలువురు పలువిధాలుగా చెప్పుకుంటున్నారు

ఒక వార్తాహరుడు యీ విషయం రెడ్డికి తెలియజేసినాడు

"చచ్చిపోయింది - నీరుగట్టు పురుగు - హు - అని వికటాట్టహాసం చేసినాడు రెడ్డి వార్తాహరుడు కూడా గొప్పనవ్వు నవ్వినాడు

అదే సమయానికే పశువులను తోలుకుంటూ కొంపెరు పిల్లలు పోతున్నారు వాళ్లుచాలా సంతోషంగా ఉన్నారు వాళ్లకు దోవలో ఒక బురదనీళ్లగుంట కనిపించింది నాగరికత యేకోశానాలేని ఆచిన్న పశువుల వాండ్లు దభీమని ఒక్కసారిగా ఆ గుంటలోనకి దూకి యీతకొట్టుతున్నారు ఇంతలో వాళ్లల్లో ఒకడు

"అమ్మో, పాము?" అని అరచినాడు

"ఏంపాము-" అన్నాడు మరొకడు కుతూహలంగా

"నీరుగట్టుపాము, అదేంచేస్తుంది, గడ్డేలేస్తం రారాండ్రా!" అన్నాడు యింకొకడు

అందరూ కలిసి ఏకష్టమూ లేకుండానే దాన్ని గడ్డకు వేసినారు

రాళ్లతోనూ, కట్టెలతోనూ దాన్ని హతము చేసినారు

"చచ్చింది- నీరుగట్టుపురుగు-హుహు"- అని వికటాట్టహాసంచేసినాడు వాళ్లలో పెద్దవాడు "హెహె-" అని మిగిలినవాళ్లంతా గట్టిగా నవ్వినారు 

## రచయితలకు మనవి

ఆంధ్రపత్రిక సచిత్రవారపత్రికలో ప్రచురించే నిమిత్తమై వందలాది రచయితలు ప్రతినెలా వెయ్యికిపైగా వ్యాసాలు పంపుతున్నారు దీనివల్ల ప్రచురించని వ్యాసాలు దాచిఉంచటంలోనూ, ప్రచురణకుగాను స్వీకరించిన వ్యాసాలు వెంటనే ప్రచురించటంలోనూ ఇబ్బంది కలుగుతున్నది అందరి సౌకర్యార్థమూ ఈక్రిందినియమాలను రచయితలు పాటించవలెనని ప్రార్థించుచున్నాము:

(1) తాము పంపే వ్యాసాలు ప్రచురించని పక్షంలో తిప్పి పంపటానికీ, ప్రచురించే పక్షంలో తెలియజేయటానికీ వీలుగా స్టాంపులు జతచేర్చి పంపేది లేదా రచనల కాపీలు తమవద్ద ఉంచుకొనేది పోస్టుబిళ్లలు జత పరచని రచనలు తిప్పి పంపబడవు

(2) దయచేసి వ్యాసాలు (*Essays*) గాని అనువాదాలుగాని పంపవద్దు

(3) "బొమ్మరిల్లు" శీర్షికకు పంపే రచనలపై "బొమ్మరిల్లు" అని వ్రాసేది

—సంపాదకుడు

# సరిహద్దులో సైనిక సమీకరణ

(3 వ పేజీ తరువాయి)

లను ఉపసంహరించాలని మొదటి షరతు ఆగస్టు 1948, జనవరి 1949 తీర్మానాల ప్రకారం కాశ్మీర్ జనవాక్య నిర్ధారణకు ఏర్పాట్లు చేస్తామని ఉభయులూ ప్రకటించాలనేది రెండో షరతు బలప్రయోగం ద్వారా కాక మధ్యవర్తిత్వం ద్వారాగాని అది విఫలమైతే పరిష్కర్తృత్వం ద్వారాగాని వివాదములను తీర్చుకోవలి, పరస్పరవ్యతిరేక ప్రచారం అరికట్టాలి, ఒకరిపై ఒకరు దండయాత్ర చెయ్యమని ప్రకటించాలి, అనేవి మిగతా షరతులు

ఈషరతులను తగిలించడంవలన లియాకత్ అలీఖాన్ చేసిన ఆహ్వానం దానంతటదే రద్దవుతున్నది పాకిస్థాన్ ప్రధాని ఈ ఉత్తర ప్రత్యుత్తరాలను స్వపక్ష ప్రచారంకోసం వినియోగించుకుంటున్నట్లు క్రమంగా స్పష్టపడుతున్నది కాశ్మీర్ వివాదవిషయంలో పాశ్చాత్యపత్రికలు మొదటినుండీ ఇండియాకు వ్యతిరేకమైన దృక్పథాన్నే అవలంబిస్తున్నాయి ఉదాహరణకు మాంచెస్టర్ గార్డియన్, పాకిస్థాన్ ప్రధాని ఆరోపణపై వ్యాఖ్యానిస్తూ, ఇండియా తనసరిహద్దుల్లో సేనలు కేంద్రీకరించడం తొందరపాటు చర్య అని విమర్శించింది పాకిస్థాన్ ప్రధాని తాజాగా చేసిన అయిదు అంశాల ప్రతిపాదనపై వ్యాఖ్యానిస్తూ "ఈ అంశాలు పాకిస్థాన్ పూర్వంనుండి చేస్తూనే ఉన్నది, కాని ఇండియా యే తిరస్కరిస్తూ వచ్చింది," అని ఆ పత్రిక వ్రాసింది కాని నిజమాలోచిస్తే, ఒకరిపై ఒకరు యుద్ధం చేయమనీ, వ్యతిరేకప్రచారం అరికట్టాలనీ, మొదలైన ప్రతిపాదనలను భారత ప్రధానియే మొదటినుంచీ చేస్తున్నారు, వాటిని పాకిస్థాన్ ప్రధానియే తిరస్కరిస్తూ వచ్చారు.

కనుక పాకిస్థాన్ పాశ్చాత్యదేశాలలో ముఖ్యంగా బ్రిటన్, అమెరికాలలో తనకు గల పలుకుబడిని, ఆ సరాను చూసుకునే ఇండియాపై కయ్యానికి కాలు దువ్వుతున్నట్టు అనుమానించవలసి వస్తున్నది ఈ సందర్భంలో భారత ప్రభుత్వం, ముఖ్యంగా ప్రధాని నెహ్రూ అనుసరిస్తున్న విధానం, తీసుకుంటున్న జాగ్రత్తి చర్యలు సర్వవిధాలా సమర్థనీయములు





---

కొడుకు : పిచ్చివాళ్లను ఎట్లా పట్టుకుంటారు, నాన్నా ?

తండ్రి : ఫేసుపౌడరుతోనూ, లిప్‌స్టిక్‌తోనూ, చీరెలతోనూ.

* * * *

ప్రసిద్ధ ఫ్రెంచి నవలాకారుడయిన బాల్జాక్‌కు ఒకనాటిరాత్రి నిద్రాభంగమయింది ఎవరో దొంగ తన సొరుగు తాళంతీయటానికి ప్రయత్నిస్తూ ఉండటం ఆయన కంటపడింది వెంటనే ఆయనగట్టిగా నవ్వసాగాడు ఇది చూసి చకితుడై దొంగ వెనక్కు తిరిగి చూసి, "ఎందుకు నవ్వుతున్నారు ?" అని అడిగాడు.

"ఆ సొరుగుగలవాడికి నాకే ఎన్నడూ కానీ దొరకనిచోట నువ్వు డబ్బుకోసం వెతకాలని శ్రమపడటంచూసి నవ్వుతున్నాను, తమ్ముడూ !" అన్నాడు బాల్జాక్.

Edited, Printed & Published by S Sambhu Prasad at the Andhra Patrika Press, 7, Thambu Chetty St Madras